# కాయశోధనవిధానము

అను

# పంచకర్మచికిత్స



: గ్రంథకర్త :

అభినవచికిత్సారత్నాకరాంధ్రశారీరశాస్త్రాది రచయిత,

## పాలంకి సూర్యనారాయణకవి.

ఉప్పాడ.



[వెల రు 0—[illegible]—0

కాయశోధనవిధాన మను నామాంతరముగల

# పంచకర్మలు.

: గ్రంథకర్త :

అభినవచికిత్సారత్నాకరాంధ్ర శారీరశాస్త్రాది రచయిత,

పాలంకి సూర్యనారాయణకవి.



 [వెల రు 0—4—0

శ్రీరస్తు:

# పంచకర్మలు



క. సురమౌనిసిద్ధసేవిత
చరణ ! కృపాభరణ ! నిగమసన్నుత ! జగదీ
శ్వర ! రుక్మిణీమనోహర !
పరమపురుష ! దేవ ! భక్తపాలన ! కృష్ణా !

— పంచకర్మసంజ్ఞ —

ఆ. పంచకర్మ లనఁగ వమన రేచన నస్య
వస్తియుగ్మకములు పరఁగుఁ; గొంద
ఱందుఁ దైలవస్తి నెడలించి రక్తమో
క్షణము వలయు ననిరి చక్రిహస్త. 1

సీ. పంచకర్మల నాచరించువిధానంబు
నను గలమతభేదముల వచింతు
మొదట స్నేహ మొసంగి మూఁడుదినమ్ములు
చనువెన్క స్వేదము సల్పి మూఁడు
దినములు విడిచి వాంతికి నిచ్చి, త్రిదినంబు
లను వెన్క నుపకర్మలను గ్రమముగ
నటువలె నొనరించి యారీతి నవకాశ
మొసఁగి రేచనముల కొసఁగి మరల

--◆ అస్థిస్నేహసేవనార్హులు ◆--

గీ. దుష్టకోష్ఠము గలవారు దుఃఖితులును
అనిలకోపము దీప్తాగ్ని నెసయువార
లస్థిభవ మైనతైలము ననుభవింపఁ
దగుదు రయ్యాది కడుపు బెంగగుట గృష్ణ ! 15

--◆ స్నేహకర్మఫలము ◆--

గీ. స్నేహపానము విధియుక్తిఁ జేయఁబడిన
బలము వర్ణము నగ్నిదీపనము కోష్ఠ
శుద్ధి యజరత్వమును ధాతువృద్ధి నిచ్చి
తనరు నింద్రియనిగ్రహత్వమునఁ గృష్ణ ! 16

--◆ స్నేహకర్మయం దుపద్రవములు ◆--

గీ. స్నేహపానము విధిదప్పి చేయఁబడిన
గలుగు నతిసారగుదతాపకామలాంత్ర
వాహికలు నస్స విద్వేషవక్త్రశోష
ములు ననేక దోషపఙ్క్తులును గృష్ణ ! 17

—◆ స్నేహపానానంతరనియమములు ◆—

గీ. పగటినిద్దుర మలమూత్రబంధనంబు
శీతమారుతముల్ వ్యాయామసేవనంబు
కఫదములు స్నేహపానసంకలితు లెప్పు
మానఁ దగునంచు భువి భిషజులు కృష్ణ ! 18

## —• స్వేదకర్మ •—

### --• స్వేదభేదములు •--

తే. ద్రవము నుపనాహ మూష్మము తాప మనఁగ
స్వేద మది నాల్గువిధములై చెల్లుఁ దాప
మూష్మము కఫము, నుపనాహము, పవనమును
ద్రవము మారుతపిత్తముం దరలుచు హరి. 19

### --• రోగభేదముచే స్వేదభేదము •--

తే. కఫరుజ నిసుక వేయించి కాపువెట్టు,
నట్లె కఫవాతరుజను స్నేహంబువలనఁ
గాని, యిసుకను వేయించిగాని, కాపు
వెట్టు, మేలండ్రు వైద్యకోవిదులు కృష్ణ! 20

తే. కఫము మేదస్సు గలవాతగదల నాత
పమున, వ్యాయామమల్లయుద్ధముల, భార
వహన, పటునేత్రవస్త్రులవలన, జెమట
దీయవలె నంచు నార్యులు దేవదేవ. 21

### --• [illegible] •--

ఆ. వేడి కాచునట్టివిధికి తాపమటందు
రుష్ణతోయజనితమూష్మకంబు
కప్పియుంచి చెమటఁగ్రక్కించు టుపనాహ
మం[illegible] మగుద్రవంబు కృష్ణ. 22

--◆ స్వేదము చేయఁదగు కాలము ◆--

క. తినునది జీర్ణము నొందిన
వెనుక భిషగ్వరుఁడు యుక్తి వెలయఁగ, శ్లేశం
బనిలమ్ము ఁ జొరనిదేశ
మ్మున రోగికి స్వేదకర్మమును జేయఁగనున్. 23

--◆ స్వేదకర్మానర్హులు ◆--

తే. మద మురఃక్షత మతిసార ముదర మేహ
పాండుమందాగ్నియుతులు దుర్బలతృషాస్ర
పిత్తములు గల్గువారు, గర్భిణులు దగరు
స్వేదకర్మకు వేదాంతవేద్య కృష్ణ. 24

--◆ స్వేదనిలయమము ◆--

తే. స్వేద మధికంబుగావింపఁ జేటు దెచ్చుఁ
గాన విధియుక్తి నొనరుపఁగావలె, నది
వృషణముల నేత్రములయందు హృదయమందు
నల్ప విస్తృతి దగునందు రార్యులు హరి ! 25

—• వ మ న క ర్మ •—

సీ. వమనకర్మను శరద్వర్ష వసంతంబు
లందు హృద్రోగకుష్ఠాగ్నిమాంద్య
పీనసార్బుదవృద్ధి, విషదోషరక్తార్తి,
సారజ్వరోన్మదశ్వాసకాస

గండమాలవిదారికారుచిమేదోవి
సర్పప్రమేహాత్రిసారవిభ్రా
మములందు కఫపిత్తజముత్తైన రుజలందు
కర్ణోష్ఠనాసికాగ్రోరుజలను
గీ. ప్రపదములందు శ్వయథుశ్లేష్మపకోపమందు
స్థైర్యబలములఁ దగి యౌషధము సహించి
వమనమును జేసికొనఁజాలు వారికి, విధి
యుతముగను జేయ మేలిడు నుర్విఁ గృష్ణ ! 26

--◆ వమనమున కనర్హులు ◆--

తే. తిమిరగుల్మోదరస్థూలదేహకృశులు
వృద్ధమదహాషయుతులు, గర్భిణులు శిశులు
క్షతుబలదానకు లూర్ధ్వరక్తానిలార్తు
లెప్పుడు వమనమునకుఁ దగ రెందుఁగృష్ణ ! 27

తే. అటులె సుకుమారులు, కృశించినట్టివారు
నస్రపరిశోషు లమితాధ్యయనపరులును
క్రిమిరుజాస్వరభంగసంకీర్ణులును, ని
రూహవస్తియుతులు దగరోయికృష్ణ ! 28

--◆ వమనక్రమము ◆--

చ. వమనవిధిన్ నియుక్తుఁడగువానికి మున్ దధితక్ర పేయదు
గ్ధముల నొకండు తృప్తిను ద్రావ నొసంగి, కఫప్రకోపముల్
ఇముడనియట్టి ద్రవ్యముల నిచ్చి పదంపడి వాంతికారులన్
గ్రమత నొసంగ దోసములు గ్రమ్మరు,నూర్ధ్వముఖంబులైహరీ!

—◆ కఫమునందు, వమనౌషధము ◆—

ఆ. కఫమునందు మ్రింగఁగాయలు పిప్పలి
సైంధవంబు వీని సమరసంబు
పలము మొదలు మూఁడుపలము లుష్ణజలంబు
తోడ నొసగ మేలు తోయజాక్షి ! 30

—◆ పిత్తమునందు వమనౌషధము ◆—

ఆ. సమత వేపయుక్తసరము చేదగుపొట్ల
గుండ శీతవారిఁగూర్చి యొసఁగి
పిత్త మూర్ధ్వగతిని వెడలింప నగుదీని
రేచనౌషధంబు శ్లేష్మము హరి ! 31

—◆ అజీర్ణకఫవాతములందు వమనౌషధము ◆—

ఆ. పాలతోడ మదనఫలరజం బిడ గను
శ్లేష్మవాతరుజలఁ జెల్లు, పిప్ప
సైంధవంబు నుష్ణజలముతోడ వక్త్ర
ముల నొసంగ మేలు గలుగుఁ గృష్ణ ! 32

—◆ దోషత్రయమునందు వమనౌషధవిశేషము ◆—

ఆ. కఫమునందు తీక్ష్ణకరములు పిత్తరో
గమున మధురశీతలములు వాత
మునను లవణ మమ్లమును మధురోష్ణముల్
గలుగునవి యొసంగవలయుఁ గృష్ణ ! 33

— ♦ కషాయవిధి ♦ —

క. వమనద్రవ్య మ్మొకకషా
యము నాల్గుజలమునందు వైచి, జలం బ
ష్టము మిగులఁ గాచి యది యుచి
తముగఁ బ్రస్థప్రమాణము మొదలుగ నిడవలెన్. 34

— ♦ వమనౌషధప్రమాణము ♦ —

తే. కల్కరసలేహ్యముల నొసఁగఁదగునెడల
మూఁడుపలములకును మించఁగూడ దటులె
క్వాథమిడునెడఁ దొమ్మిది ప్రస్థములకు
మించిపోవఁగినఁ గీడు గావించుఁ గృష్ణ ! 35

— ♦ వమనమునందుత్తమ మధ్యమహీనావస్థలు ♦ —

తే. ఏడువమనంబులను గఫ మెగ్గ వెడలి
పిత్తమెనిమిదింటను బోవు టుత్తమంబు
ఆరిటను బిత్తమగుట మధ్యమము హీన
మగునునాల్గింట నది పోవు టంబుజాక్ష ! 36

— ♦ వమనౌషధాదులందు ప్రస్థనిర్ణయం ♦ —

తే. వమనరక్తమోక్షణముల రేచనకల్ప
ములను పల మసంగ మూఁడుతులము
లగును ప్రస్థ మసంగ సరతోడిపదుమూఁడు
పలము లగునటండ్రు పంకజాక్ష ! 37

—♦ వమనమునకు సుఖప్రాప్తికి ♦—

ఆ. వమనములకు నౌషధము నొసఁగుచుండు, మూ
కాళ్లుభూమి నాని కంఠమునను
దగినరీతి నాముఁ పువేరుతోఁ జూర్
ణమ్ము సేయఁగ వమనము లుడుగు హాని ! 38

—♦ వమనాధిక్యమున గలుగు నుపద్రవములు ♦—

ఆ. వాంతు లధికమగుటవలన నిష్ఠీవన
మక్షిజిహ్వావికృతులాస్యశోష
మింద్రియావశతయు హిక్క త్రేన్పులు పెద్ద
హనుగళప్రపీడలగును గృష్ణ ! 39

—♦ అధికవమనములచే నాలుకలోనికేగినవానికి చికిత్స ♦—

ఆ అమితవాంతి రేచనము సేయునెడ నిల్చి
నాల్క లోనికేఁగునాఁడు మఱికిఁ
బిళియ మొసంగుతక్రఘృతకబుమధురాన్న
లవణరసము లిడవలయును గృష్ణ ! 40

—♦ వమనముచే బయటకు వచ్చిన నాలుకకు చికిత్స ♦—

తే. వమనమున జిహ్వ బయటికి వచ్చియున్నఁ
దిలలు ద్రాక్షయు సమభాగములుగ నూఱుచుఁ
గల్క మొనరించి పూసిన నక్కడనది పోవ
నదియు స్వస్థానమును బొందు నంతఁ గృష్ణ ! 41

—♦ వమనానంతర పథ్యవిధి ♦—

తే. వమితునకు సక్రమంబుగ వమనము లగు
పిదప నపరాహ్ణమందునఁ బెసరకట్టు
జాంగలరసంబు వీనితో షష్టికౌద
నం బొసంగఁగవలె నాదినమునఁ గృష్ణ ! 46

—♦ వమితునకు వర్జనీయములు ♦—

తే. వమితుఁ డానాఁడు శీతోదకమును గొనుట
యాగ్రహంబును, శ్రమయు, నభ్యంజనంబు
మైధున మజీర్ణకరములు మానవలయు
నందు రార్యులు మదదైత్యహరణ కృష్ణ ! 47

—♦ వమనము కానియెడ నీయవలసినయది ♦—

క. పిప్పలి సైంధవ ముసిరిక
పప్పును సితసర్షపములు పానీయముతోఁ
దప్పక యిడఁదగు వమన మొ
కప్పుడు తగురీతి గాని యప్పుడు మురారే ! 48

—♦ వమనంబుపిదప బీభత్సయోగములు —

తే. వమనయోగములను సైంధవమును దేనెఁ
జేర్ప హితవును మేలును జేయు నెపుడు
ఘృతముఁ జేర్చి యొసంగినఁ గీడు గల్గు
నదియె బీభత్సయోగ మటండ్రు కృష్ణ ! 49

తే. నటె యకృద్రోగయుతులు విషార్త లక్ష్మ
జనితదోషార్తు లెపుడు రేచనము లగుట
కౌషధంబును సేవింప నగునటందు
రార్య వైద్యులు భక్తవిహారి కృష్ణ ! 52

—♦ విరేచనకర్మానర్హులు ♦—

ఉ. బాలురు వృద్ధులున్ క్షతవిబాధితులున్ దృషు లక్నిహీను
లున్ । స్థూలురు గర్భిణుల్ తరుణసూతికలుం భయశల్య
విద్ధలుం । దూలినవారు ధాతుగతదోషయుతుల్ సుకుమా
రు లున్మద । స్థాలితు లామగజ్వరవికారు లనర్హులు రేచన
క్రియన్. 53

—♦ మృదుమధ్యక్రూరకోష్ఠవివరణము ♦—

తే. కోష్ఠములు మూడువిధములై క్రూరమధ్య
మృదుసమాఖ్యలఁ దగునందు మొదటిది పవ
నమునకుఁ దుదిది పైత్యమునకు నడిమిది
కఫమునకుఁ జెల్లునని యెఱుఁగవలెఁ గృష్ణ ! 54

—♦ క్రూరమధ్యకోష్ఠములయం దౌషధములు ♦—

ఆ. క్రూరకోష్ఠయుతులఁకును వజ్రిదుగ్ధనే
పాళదంతు లనెడివాని నొసగ
వలయు మధ్యకోష్ఠకలితులకును రేల
తెగడరోహిణుల నొసగవలె హరి ! 55

—♦ మృదుకోష్ఠమున కౌషధము ♦—

క. మృదుకోష్ఠమునను బాలా
ముదమున్ ద్రాక్షారసంపు మేళనతో నే
యందగు విరేచనముల క
య్యది కోష్ఠమలంబుఁ దేల్చు నతిసుకరముగన్. 56

—♦ అన్ని కోష్ఠములకు సామాన్య విరేచనౌషధము ♦—

తే. ఆముదంబును ద్విగుణమౌ నావుపాలఁ
గాని త్రిఫలాకషాయయుక్తముగఁ గాని
కొనినయంతన సుఖవిరేచనము లగును
దగుఁ ద్రిదోషములం దిది మగధవైరి ! 57

—♦ ఉత్తమాదిభేదముల చే రేచనౌషధపరిమాణము ♦—

క. పలయుగ్మంబును పల మర
పలమును బరిమితిగ నొసగు క్వాథమునకు వె
జ్జలిడిరి యుత్తమమధ్యమ
ములని, కనిష్ఠమని నామములు మురవైరి ! 58

—♦ రేచనౌషధమునకల్కాదుల పరిమాణము ♦—

ఆ. కల్కచూర్ణమోదకముల వయోబల
ముల నెరింగి యొసగవలయు నిందు
తేనె గాని నేయి గానిమితము గూర్చి
కర్షమితము నీయఁగవలెఁ గృష్ణ ! 59

—♦ ఉత్తమాదిభేదములచే రేచనప్రమాణము ♦—

తే. వసుధ నుత్తమమాత్ర ముప్పదికిఁ బైని
మధ్యమం బిర్వదికిఁ బైని మఱి యధమము
పదిటికిని బైని కఫము బడెడునట్లు
రేచనంబులు చేయు సరోజనేత్ర. 60

—♦ వర్షఋతువునందు రేచనౌషధము ♦—

తే. వర్షఋతువునఁ దెగడ పిప్పళ్లు శుంఠి
కొడిసెవిత్తులు సమముగాఁ గూడఁజేసి
దానిఁ దగురీతిఁ దేనెతోఁ గాని, ద్రాక్ష
రసముతోఁ గాని యొసఁగ మేల్పొసఁగుఁ గృష్ణ ! 61

—♦ శరత్కాలమున రేచనౌషధము ♦—

ఆ. దురదగొండి తెగడ తుంగముస్తలు కల
కండ, యష్టి మంచిగంధములను
రజ మొనర్చి ద్రాక్షరసముతో నిడ శర
త్సమయమునను మేలొసంగుఁ గృష్ణ ! 62

—♦ హేమంతమున రేచనౌషధము ♦—

తే. తెగడ వస చిత్రమూలము నగరు శుంఠి
జీలకఱ్ఱయుఁ గాంచనక్షీరి దేవ
దారువుల్ గూడఁజేసి తుషారసమయ
మునను రేచనముల కిడఁజను గృష్ణ ! 63

—♦ శిశిరవసంతములయందు రేచనౌషధము ♦—

తే. కణమహౌషధ సింధుసుగంధి త్రివృతు
లను రజంబుగఁ జేసి తేనెను గొనంగ
శిశిరవాసంతికముల మేల్సేయు రేచ
నములు గావించి దైత్యవినాశ కృష్ణ! 64

—♦ గ్రీష్మమున రేచనౌషధము ♦—

క. చక్కెరయుఁ దెగడపొడి రెం
డొక్కటిగను పాల్గుగూర్చి యుక్తముగ నిడన్
జక్కఁగ విరేచనము లగు
నిక్కల్పన గ్రీష్మమునను హితమగుఁ గృష్ణా! 65

—♦ రేచనకర్మయందు సహజోపచారము ♦—

తే. రేచనమ్ముల కిడి వెన్క లోచనముల
శీతలం బగుజలములచేతఁ దుడిచి
సురభిసుమములు వాసన చూపి, మంచి
విడెము సేయింప నులమెల్ల వెడలుఁ గృష్ణ! 66

—♦ రేచనకాలవర్జనీయములు ♦—

క. చల్లనిజలసంస్పర్శము
చల్లనిగాలియును, నిద్ర, సంధారణముల్
చెల్లవు రేచనకర్మకు
తెల్లొడ్డె స్నానంబుసేవ హితము గాదుఁ గృష్ణా! 67

— వమన రేచనములతో వెడలు దోషములు —

తే. వమనమునఁ గఫపిత్తౌషధము లనిలముఁ
గ్రమతఁ దరిఁగెడునటు విరేకములవలనఁ
మలము పిత్తౌషధ శ్లేష్మములు వరుసగ
వెడలు మనుజుల కెందును విశ్వరక్ష ! 68

— విరేచన వైకల్యముచే గలుగు దుష్ప్రభవములు —

తే. దుర్విరిక్తునికివి నొడల్ దురద తాప
మరుచి వాంతియు వాయుమలాప్రవృత్తి
కడుపుబరు వుబ్బరము, శూల గల్గు భ్రమ జ
నించు నిది హీనయోగమా నెంచఁ గృష్ణ ! 69

క. ఇందు విరేచనములకున్
మందిడ నవి తొలఁగు, విడకపోని యుపేషన్
జెందుటను గామలాదుల
కుం దావగు ననుచుఁ దెలిసికొనఁదగును హరీ ! 70

— అధిక రేచనములవలన గల్గుదుష్పరిణామములు —

ఆ. అతివిరేచనమ్ము లగుటచే మూర్ఛయు
శూల గుదము జెడుట, శోణితంబు
కఫము క్రొవ్వు మాంస కలితద్రవము గుద
మునను వెడలుటయును బుట్టుఁ గృష్ణ ! 71

—◆ హీనయోగమున ప్రతిక్రియ ◆—

తే. రేచనౌషధమును గొన రేచనములు
క్రమతఁ గాకున్న, నుష్ణోదకమున సైంధ
వమును జేరిచి యొసఁగు టుత్తమము దాని
వలన నద్దోష మెడలు శుభకరకృష్ణ ! 72

—◆ అతియోగమునను ప్రతిక్రియ ◆—

క. రేచనములు నిలువనియెడు
తోఁచినఁ జన్నీట నొడలు దుడిచి, వడి, యసం
కోచతఁ గడుగునఁ దేనెను
నైచి యొసఁగి వాంతిఁ జలుపవలయును గృష్ణా ! 73

## అనువాసనవస్తికర్మ

తే. వస్తికర్మ నిరూహానువాసనముల
ద్వివిధమై యుండు దత్కర్మభేదవశత
మఱియు నుత్తరవస్తియు, మాంత్రవస్తి
యనఁగ మఱిరెండు వచియింతు రవనిఁ గృష్ణ ! 74

—◆ అనువాసనార్హులు, తన్నిషిద్ధులు ◆—

తే. అగ్నిదీపనగలవార లనిలరోగ
వశులు నస్నిగ్ధు లెపు డనువాసనమున
కర్హులు, ప్రమేహమేదోదరామయులకు
గుష్ఠయుతులకుఁ దగ దిది గోప కృష్ణ ! 75

—◆ వస్తియంత్రనిరూపణము ◆—

తే. లోహమును, గాజు, వెదురును లోనుగలుగు
వానిచే వస్తియంత్ర మేర్పడుచు నొప్పు
నదియె 'పిచకారి' యనఁ దగు నట్టిదాని
వలనఁ దైలాదు లెక్కింపవలయుఁ గృష్ణ ! 76

—◆ వస్తియంత్రప్రమాణము ◆—

తే. ఆఱు నెనిమిది పదియు రెండంగుళముల
పొడవు, దానికిఁ దగు వెడల్పును గ్రమముగ
రంధ్రములు ముద్గచణ బదరాస్థితుల్య
ములుగ నిర్మింపవలెఁ బుచ్ఛములను గృష్ణ ! 77

—◆ వయసునకుదగువస్తియంత్రములు ◆—

క. ఆఱంగుళమ్ము లొప్పెడు
నాఱేడులవయసువఱకు నటు లెనిమిది యొ
ప్పారుఁ బదిరెండువఱ కా
తీరునఁ బదిరెండు పిదపఁ దిరముగఁ గృష్ణా ! 78

—◆ మఱియొకవిధ మగువస్తియంత్రము ◆—

తే. వస్తియంత్రము మృగములవస్తివలనఁ
జేయుచుండుట గల దది ఛిద్రనాళ
మునకుఁ గూరిచి తన్మూలమున ద్రవాదు
లూని యవి చిమ్మఁగావచ్చు లోనికి హరి ! 79

— వస్తికర్మార్హమగు కాలము —

తే. తగును సాయంతనము వసంతమున, స్నేహ
వస్తికిటు శరద్గ్రీష్మముల్ వర్షఋతువు
వెలయు రాత్రి నొనర్ప నీ విధికిఁ దగరు
స్నిగ్ధరూక్షాన్న సేవితుల్ శేషశయన. 80

— వస్తికర్మచే గలుగు ఫలము —

క. తనువృద్ధియు, దీర్ఘాయువు
ననుపమకాంతియును బలము నారోగ్యంబుఁ
గను వస్తికర్మ సక్రియ
తను బడసినమనుజుఁ డెందు దైత్యధ్వంసీ ! 81

— బలమునుబట్టి స్నేహప్రమాణము —

క. బలముగలవారలకు ష
ట్పలమితమౌ స్నేహ మొసఁగవలె మధ్యమమౌ
బలమునఁ బలత్రయంబును
బలహీనుల కందు సగముపరిమితి కృష్ణా ! 82

— స్నేహవస్తియందు వాల్తి సైంధవసేవనము —

తే. సైంధవము పిల్లితేగలు సమతఁ గూర్చి
చూర్ణ మొనరిచి యదికోష్ఠశుద్ధికొఱకు
రెండుమొద లాఱుమాషము లుండునట్లు
స్నేహవస్తికి మున్నిడఁ జెల్లుఁ గృష్ణ ! 83

— వస్తిప్రయోగక్రమము —

సీ. తొలుత రేచనకర్మవలన సంశుద్ధుఁడౌ
నతనికి నొకవారమునపిదప
యభ్యంజన మొనర్చి యనువగునుష్ణోద
కము లెస్స చెమ్మట గలుగఁ బోసి
యనువగురీతి భోజన మిడి, నడియాడు
టలు గూర్చి మలమూత్రములను విడువ
నలిపించి వామపార్శ్వమున దక్షిణపాద
మును వంచి శయనించుటను వచించి

గీ. గుదమునకుఁ దైల మలఁది, నెమ్మదిగ నలయు
తైల మొక్కింత వస్తియంత్రమున లాగి
వాయుమార్గమునను జిమ్మి పదకరములు
పొడవులుగ వెన్ను శయ్యను బూన్చి పిదప. 84

క. గుదకటిదేశంబుల నె
మ్మదిగను మువ్మారు తట్టి, మాంసాదుల క
య్యది చేరునటులు బిఱుఁదులు
పదపడి కుదిలింప నెఱుఁగఁబలికి యటుపయిన్. 85

తే. కదురుగా నైదునిముసముల్ కదలకుండ
వాని నటులుంచి సుఖనిద్ర వఱలువల్లఁ
జేయవలె దాన స్నేహంబు చేరు నెల్ల
ధాతువుల కది జీవప్రదమయి కృష్ణ ! 86

— వస్తికర్మయందు విడువదగినవి —

ఆ. వస్తికర్మ చేయఁబడునెడ తుమ్ముట
దగ్గు టావలింత దగఁ బసాన
వాతవిస్మృతి వలదు, వాటిల్లుఁ గడుఁదు
గాన వాని నుడుపఁగవలెఁ గృష్ణ ! 87

— న్యూనాధిక వస్తిచే గలుగు దోషము —

క. హీనమగు వస్తికర్మము
మానవుఁ రోగమ్ము లధికమాత్రములై
పై నానాహము బడలికయును
మానుగ నతిసారరుజయు మఱి దెచ్చుహరీ ! 88

— చక్కఁగ వస్తి జరిగినట్లు తెలియువిధము —

క. మలమును గాలియుఁ దైలముఁ
గలిసి సుఖంబుగను శీఘ్రగతి వెడలినచో
నలవస్తికర్మ చక్కఁగ
జలుపఁబడిన దంచుఁ దెలియఁజను శ్రీకృష్ణా ! 89

— స్నేహపాకారము నొలగుటకు —

తే. చమురు లోనని జీర్ణమై, జాఠరాగ్ని
ప్రబలునెడ షష్టికాన్నమొ, ప్రాఁతబియ్య
నన్నమో పెట్టి, మరుదినమందు శుంఠి
ధాన్యకక్వాథముల నీయఁదగును కృష్ణ ! 90

# అనువాసనవస్తికర్మ

తే. వాతరూక్షులయం దనువాసనంబు
వరుస తొమ్మిదిదివసములవఱకుఁ జేయఁ
దగును సస్నిగ్ధులకును మేదస్సుగల్గు
వారికి నిరూహణమ్మె వలయుఁ గృష్ణ ! 91

—♦ క్రమవస్తియందలి ప్రయోజనము ♦—

సీ. తొలివస్తి యండసంధులనుండి మెఱుఁ జొచ్చి
యది ధాతువులఁ గూడు నవలఁ జేయఁ
బడువస్తి మస్తకవాతంబు దొలఁచు; మూఁ
డవది కాంతిబలప్రభవము; నాల్గు
రసవృద్ధి నిడు; నైదు రక్తవృద్ధి నొసంగు;
నా ఱామిషస్నిగ్ధమై తనర్చు:
నేడు మేదస్సున కిచ్చుస్నిగ్ధత్వ; మె
న్మిది తొమ్మిదియుఁ గూర్చు నెపుడు శుక్ర

తే. మునకు స్నిగ్ధత్వ, మిటు పదునెనిమిది నిడ
సకలశుక్రదోషమ్ములు సమయు వీని
ద్విగుణతను మానవుం డొప్పు ద్విరదబలము
నశ్వధాటియుఁ గల్గి శ్రీహరి మురారి ! 92

— స్నేహము జీర్ణమొందనివారికి చేయువిధి —

చ. వలనుగ రేచనక్రియయు వాంతి నొనర్పక చొన్పు తైలమున్
మలమునుగూడి వెల్వడక, మానుగ నయ్యది పక్వకోశమం
దలమి గురుత్వదేహశిథిలాదు లనాహము శ్వాసశూలలన్
గలుగఁగఁజేయు నప్పు డతిగాఢనిరూహణ మొప్పు శ్రీహరీ!

— స్నేహవస్తి విడుకఁ దగినవారు —

గీ. స్నేహ మటు రాక, వికృతిని జేయుచున్న
నతని రూక్షునిగా నిర్ణయ మ్మొనర్చి
వానియెడ స్నేహవస్తిని మానవలయు
ననిరి సద్వైద్యవిదులు శ్రీహరి ! మురారి ! 94

— తైలము వెలిపుచ్చుట కుపాయము —

క. తొలివస్తిఁ జొనుపు తైలము
వెలువడకుండినను దాని వెలిపుచ్చ నగున్
మలివస్తి వలన దానం
దలఁగనియెడ రేచనౌషధమె మేలు హరీ! 95

— అనువాసన తైలవిధి —

సీ. భారంగి కానుగుపట్ట యశ్వసరంబు
ముల్లుగోరంట యాముదపువేళ్లు
కామంచి సిల్లి తేగలు కాకిదొండయుఁ
దిస్సతీఁగయు నివి దినుసుకొక్క

పలము; మిర్యములు మలవలు కేఁగుర్తులు
నవిసివర్తినములు యవలును నివి
పలయుగ్మములుగ చేర్చఁబడి మెత్తఁగ దంచి
జలము నాలుగుద్రోణములను జేర్చి
గీ. కాచి ద్రోణావశేషముగా దిగిల్చి
తైల మాఢకము దించి వాని నష్ట
వర్గచూర్ణము లొక్కొక్కపలము వైచి
తైలవిధిఁ బక్వముఁ జేయఁ దగును కృష్ణ! 96

— వస్తికర్మయందు పథ్యములు —

(విపర్యాసమున గల్గురోగములు.)

గీ. స్నేహపానమునందునఁ జెప్పఁబడిన
పథ్యపానాదు లీయనువాసనమునఁ
బరఁగు; విధిదప్పి సేయ జెబ్బదియునాఱు
విషము లగురోగములు గల్గు విశ్వరక్ష! 97

## నిరూహవస్తికర్మ

(నిరూహాస్థాపనల కభేద మనుటకు)

గీ. ధర నిరూహణభేద మాస్థాపన మగు
ధాతుసంస్థాపనతను నాస్థాపనముగ
రోగదోషోపశాంతి నిరూహముగను
గల్పనాభేదములఁ బేరుఁ గాంచెఁ గృష్ణ! 98

క. కల విల నిరూహవస్తులు
పలువిధములు వాని కుచితపద్ధతి నాపే
రులు పల్కఁబడియె వానిని
దెలుపుదు నీకుఁ గల్పనావిధిని దెల్పునెడన్. 99

—◆ నిరూహవస్తి కషాయపరిమాణము ◆—

తే. మహి నిరూహణ ముత్తమమధ్యమాధ
మములఁ దగు; బ్రిస్థపాద ముత్తమము; ప్రిస్థ
మైన యది మధ్యమం బననగుఁ; గనిష్ఠ
మగును గుడవత్రియం బైన, నబ్జనాభ ! 100

—◆ నిరూహవస్తి కర్హులు ◆—

చ. ధర విషమజ్వరార్తియును, దప్పి యనాహము మూత్రకృ
ఛ్రి మాశ్మరియు నసృగ్దరం బనిలసాదము శూలయు మేహ
మారుతో । దరరుజ లామ్లపిత్తము నుదావృతహృద్గదవాత
రక్తముల్ । దొఱఁగు నిరూహవస్తి నిడుతోడనె శ్రీరమణీ
మనోహరా ! 101

—◆ నిరూహకర్మానర్హులు ◆—

చ చనదు నిరూహవస్తి యతిసారజలోదరకుష్ఠశోధలం
దున ఘనమూర్ఛలందుఁ గఫదోషవిషూచ్యతిసారహిక్కలం
దునను గృశత్వభగ్నగుదదోషములందును నూర్ధ్వగాములౌ
ఘనరుజలందు స్నిగ్ధులకు గర్భిణులై తగువారికిన్ హరీ !

—♦ నిరూహవస్తిక్రమము ♦—

సీ. వసుధలోన నిరూహవస్తి గావించెడు
తఱి మున్ను వానిమూత్రమలవాత
ములఁ దొలఁగింపఁగాఁ జలిపించి యభ్యంజ
నము సల్పి యుష్ణోదకమును బోసి
చెమ్మటఁగొల్పి యన్నమ్ము వెట్టక రెండు
జాము లట్లుంచి, విజననివాస
మున నిరూహంపువస్తిని జేసి యొకముహూ
ర్తము వాని నయ్యాది తరలునట్టులు
గీ. గొంతుకూర్చుండ నియమించి కొరతవడక
క్రమతఁ జనువెన్క నుష్ణోదకమున మరల
జలక మాడించి లఘుతభోజన మొసంగి
స్నేహితునివలెఁ బచరింపఁ జెల్లుఁ గృష్ణ! 103

—♦ వస్తి వెడలనపుడు చేయవలశిన విధి ♦—

తే. చననివస్తికి రేచనౌషధము గాని
పంచితము సైంధవము నిమ్మపండులరస
మును యవక్షారమును గూర్చి మునుపటివలె
నొసఁగఁబడు వస్తిగాని మేలొసఁగుఁ గృష్ణ! 104

—♦ నిరూహసమ్యగ్యోదాదులఫలము ♦—

సీ. వస్తి లెస్సగఁ జేయఁబడినట్టివానికి
మలపిత్తకఫవాతములు దొలంగి

తనులఘుత్వమ్ము స్వేదము మనోగ్లానంబు
స్నిగ్ధత రోగశాంతియును గల్గు
నది యసమ్యగ్యోగ మగునెడ మలవాత
ములు కొంచెముగఁ జను; మూత్రరోగ
మును, శరీరజడత్వమును, జిహ్వా కరుచిత్వ
మును గల్గఁజేయుఁ గావునను వైద్యుఁ

గీ. డమితకుశలత్వమున నిరూహానువాస
నాదికమ్ములరోగబలాను తెఱఁగి
యనిలకఫపిత్తదోషామలందు వాసి
విధినియుక్తిని సలుపఁగా వెలయుఁ గృష్ణ ! 105

—◆ వా త పి త్తా ను ల యం దు వ స్తి సం ఖ్య ◆—

గీ. ఒనర నూనెతో వాతమం దొక్కమాఱు
దుగ్ధయుతముగఁ బిత్తమందునను రెండు
మాఱులు నిరూహవస్తికర్మ మలయు నని
పలుకుచుందురు సద్వైద్యవరులు కృష్ణ ! 106

—◆ క ఫ ము నం దు వ స్తి ప్ర యో గ ము ◆—

గీ. కఫమున ఫలత్రియంబు త్రికటుకములును
యవలు నుల్వలు మొదలగునవియుఁ గూర్చి
క్వాథ మొనరిచి మున్మాఱుగా నిరూహ
వస్తి సల్పుట మేలండ్రు వరద కృష్ణ ! 107

—♦ దోషములయందు చేయఁదగువస్తి ♦—

గీ. ఆది నుత్క్లేశవస్తి మధ్యమమున ను
దోషహారవస్తి కడపట దోషశమన
వస్తి శస్తము; సుకుమారబాలవృద్ధు
లం దొనఁగు గాఢవస్తి కీడం(దు కృష్ణ ! 108

—♦ ఉత్క్లేశవస్తి ♦—

క. ఇప్పయు వస సైంధవమును
బిప్పళ్లును జేదుపుచ్చ పేరాముదపు౹
బప్పా సమభాగకల్కం
బొప్పెడు నుత్క్లేశవస్తి కుర్వి మురారీ ! 109

—♦ దోషహరవస్తి ♦—

గీ. వెలఁగపండును బిల్లితేగలును యష్టి
మధుకమును బిల్వఫలము సమానములుగఁ
బుల్లకలితోడ నూఱి గోమూత్రమందుఁ
గల్పి యిడ దోషహారవస్తిగఁ దగుఁ గృష్ణ ! 110

—♦ శోధనవస్తి ♦—

గీ. దంతి మున్నగుశోధనద్రవ్యములక
షాయమున రేచనద్రవ్యజనితకల్క
సైంధవస్నేహములను మిశ్రము జేసి
తరచి యొసఁగెదు వస్తిశోధనము కృష్ణ ! 111

—• దోషశమనవస్తి •—

గీ. సమతఁ బ్రేఁకణమును రసాంజనము నిప్ప
ముస్తె యను నివి సమభాగములుగ నావు
పాలతో నూఱికొని యదిపాయువునను
జిమ్మ నది దోషశమ మగుఁజుమ్ము కృష్ణ! 112

—• లేఖనవస్తి •—

సీ. త్రిఫలకషాయంబు తేనె గోమూత్రంబు
గల్పి యందున యవక్షారపాంశు
కాసీసములు పుష్పకాసీస మింగువ
సైంధవలవణంబు చౌటియుప్పు
మైలతుత్థంబును శైలజం బను నివి
సమభాగయుక్తిఁ జూర్ణముగఁ జేసి
మేళన గావించి మిత్రిగ వస్తినొసంగఁ
దొలఁగించు నశ్మరీదోషభయము

గీ. తరుగఁజేయును గుల్మమేదస్సు లటులె
మూత్రకృఛ్రము దొలఁగించి ముద మొసంగు
నిదియ లేఖనవస్తి యనా నిందుఁ జేర్చు
వాని మితిమీఱి సేయఁగా వలదు కృష్ణ! 113

—• బృంహణవస్తి •—

గీ. వృష్యకందము మొదలగుబృంహణకర
ములకషాయము మాధుర్యము లగుఫలర

సములకల్కము మాంసరసము ఘృతము
నెనసి బృంహణవస్తిగాఁ దనరుఁ గృష్ణ ! 114

— పిచ్ఛిలవస్తి —

గీ. రేఁగు బూరుగు విరిగి నారింజ శొంఠి
మర్కటియుఁ బాలతోఁ జూచి, మగుపు జింక
గొఱ్ఱమేఁకలరక్తంబు గూర్చి చేయు
వస్తి పిచ్ఛిల యనఁదగు వాసుదేవ ! 115

— దీపనవస్తి —

గీ. సైంధవము చేఁదుపుచ్చ కర్జంబువంతు
కల్క మొనరిచి పలయుగ్మకములుగ మను
దుగ్ధఘృతములఁ జేర్చి వస్తుల నొసంగ
దీపన మొనంగు నరులకు దీనరక్ష ! 116

— యుక్తరథవస్తి —

గీ. నూనె సైంధవలవణంబు తేనె వసగు
కణయుఁ దక్కోలబీజముల్ కలియునట్లు
చేయు నేరండమూలకషాయవస్తి
యుక్తరథవస్తి యన్నిట నొప్పుఁ గృష్ణ ! 117

— సిద్ధవస్తి —

గీ. పంచమూలకషాయంబు మంచినూనె
మధుకసైంధవమాగధీమధువు లెలమిఁ

గూడ నది సిద్ధవస్తిగా వాడుదు రది
యెల్లరోగంబులందు మే లిచ్చుఁ గృష్ణ ! 118

— సాధారణనిరూహకల్పనము —

గీ. క్షౌద్రము కుడువ మక్షము సైంధవంబు
స్నేహ మాఱుపలంబులు జేర్చి యామ
యమున కర్హత గలకషాయమ్ము నష్ట
పలమితం బందు గూర్చఁగవలయుఁ గృష్ణ ! 119

— దోషత్రయములందును మధుతైలాదుల చేర్చువిధము —

గీ. పవనమున నాలు గాఱుగఁ; బైత్యమునను
నాల్గు మూఁడుగ; శ్లేష్మగణమున నాఱు
నాలుగుగ; తేనె స్నేహముం బాలు గూర్చి
వస్తి సేయఁగ శమియింపఁబడు నవి హరి ! 120

— మధుతైలికవస్తి —

తే. ఆముదపువేరులకషాయ మష్టపలమి
తముగ, మధుతైలములు రెండు దానికెనఁగ
సైంధవము సోపుపొడితుఁ గల్కియుగముఁలుగ
బరఁగునది మధుతైలికవస్తి కృష్ణ ! 121

— ఉత్తరవస్తి —

తే. క్రమత ననువాసనము నిరూహమును నల్ప
ిదప నొనరింపఁబడుటను, గుదముగాక

నూర్ధ్వమునఁ జేయఁబడుటఁ దా నుత్తరాఖ్య
బరఁగె నీవస్తికర్మ కిద్ధర మురారి ! 122

— పురుషోత్తరవస్తి యంత్రము —

క. అంగుళములపలము పదిరెం
డంగుళముల పొడవు, నర్మ కొలవగుపట్టు లా
రంగుళముల పొని నప్లప
ము గబళింప నగు సుషిరము పురుషుల కగున్. 123

— స్త్రీవస్తియంత్రము చేయుక్రమము —

తే. స్త్రీల కిడువస్తియంత్రము చిటెనవేలు
లావుగలదిగఁ బదియంగుళముల పొడవు
పెసరగింజంత తొలయును బోసఁగియుండ
వలయు నిది యోనివస్తికిఁ బరగుకృష్ణ ! 124

తే. దీని రెండంగుళమ్ములు యోనిఁ జొరగఁ
జేసి నిశ్చయమగుపట్టి స్నేహములను
గాని తద్రోగహరములౌ క్వాథములను
గాని చిమ్మఁగవలయు జాగ్రతను కృష్ణ ! 125

— ఉత్తరవస్తివలన దొలఁగురోగములు —

తే. అరయ నుత్తరవస్తి గర్భాశయమునఁ
గలుగురుజలందు, యోనిరోగముల, వస్తి
గతములందును మూత్రరోగంబులందు
శస్త మిది మహారోగికిఁ జనకృష్ణ ! 126

— పురుషునికి చేయు నుత్తరక్రమము —

సీ. అవని నుత్తరవస్తి కనుకూలుఁ డగురోగి
కాస్థాపనము నిరూహణము సల్పి
పిమ్మట ననువాసనమ్మునకునువలె
స్నానభోజనవిధుల్ జరిపి వాని
నొకమూరయెత్తున నుండుపీఠమ్మునం
దాసీనుఁ గావించి యంత్రపుచ్ఛ
మును లింగమార్గమం దనువుగా నారంగు
ళములు పోనిచ్చి తైలమును లోని

గీ. కరుగునటు వస్తిపీడను జరిపి దాని
మరల వెడలింపనగు లోని కరిగినట్టి
తైల మదియెల్ల నొకముహూర్తంబులోన
వెడల సక్రమవస్తి నాఁబడు మురారి ! 127

— స్త్రీబాలవస్తి క్రియావిశేషము —

తే. వెలఁది కుత్తరవస్తిఁ గావించు నెడల
వెల్లకిల శయ్యఁ జేర్చి మోఁకాళ్లు ముడువఁ
జేయుటయు, బాలులకు వస్తి చేయు నెడల
నంగుళమె చొన్పఁబడుట మర్యాద కృష్ణ ! 128

— స్నేహపరిమాణము —

క. పలమితము లింగమందున
పలయుగ్మము యోనియందు, బాలురకైనన్

బలమునను సగము వంతున
జలుపనగుఁ స్నేహవస్తి శ్యామలగాత్రా ! 129

— వయోవిశేషముచే ఔషధప్రమాణము —

తే. పంచవింశతివర్షముల్ పరఁగువఱకుఁ
బలమునందున సగ మటుపైని పలము
స్నేహ ముత్తరవస్తికిఁ జెల్లుననుచుఁ
బల్కుదురు వైద్యవిదులు గోపాలకృష్ణ ! 130

— శోధనద్రవ్యాదులచే వస్తి —

తే. మూత్రకృచ్ఛ్రాదులందు నామదము మొదలు
శోధనద్రవ్యములు మేలు చూపు; వస్తి
వికృతిఁ జెందినచో క్షీరవృక్షవల్క
లపుఁగషాయాదు లిడు శుభ మెపుడు కృష్ణ ! 131

మఱియును

తే. పచ్చిపాలతోడ వస్తికర్మ నొనర్పఁ
బొత్తికడుపు శుద్ధి పొందఁబడు నై
కాక శుక్రధాతుగతదోషములు నార్త
వమునఁ గల్గురుజలు వాయుఁ గృష్ణ ! 132

— ఫలవర్తి —

తే. ఆముదపుఁబప్పు మొదలగునట్టి శోధ
నౌషధపుఁగల్కమును వర్తి నమరఁ జేర్చి

యోనిగుదముల నెందేని యునుప నచటి
కలుషమలములు నెడలించుఁ గమలనయన ! 133

మఱియును

క. క్రిమియు నుదావర్తము గు
ల్మము మేహరోగ మహితమలదోషముఁ బ్లీ
హామున్ దోలఁచి కాంతిబలను
క్రిము లనలము, రసముఁ బెంపఁగలుగు నది హరీ ! 134

## నస్యకర

సీ. జత్రూర్ధ్వగతముకై జనియించు ముఖశీర్ష
గళకర్ణనాసాక్షిగద లణంప
నస్యకర్మకు సమానమువచ్చునది లేదు
శీర్షమార్గంబు నాసికమె కాన
నారోగములయందు ననుకూలమైనట్టి
శమనబృంహణవిరేచనము లనెడి
నస్యంబులను నేర్పునను జేయవలెఁ బ్రీతి
మర్శావపీడనమర్శము లను

గీ. భేదములు వానిసంఖ్య మోతాదులార్తి
కాలబలయంత్రనిర్మాణగతులు వలయు
పథ్యము నపథ్య ముపయోగపఱచువిధము
నెఱిఁగి సద్వైద్యవిదులు శ్రీహరిమురారి! 135

—♦ నస్య కర్మము ♦—

సీ. కడునేర్పునను భిషగ్వరుఁ డప్పునస్యకర
ములకు శ్లైష్మికశీతివెలయుపోనఁ
గఫనివృత్తికిఁ బూర్వకాలమ్మునను పైత్య
ములయందు మధ్యాహ్నమునను వాత
మునకు సాయంకాలమునను కల్కముగాని,
తైలంబుగాని ఘృతంబుగాని,
స్వరసంబుగాని, రజము గానిదగుచుండ
వెలయఁగఁ గల్పనాషధుల నెఱిఁగి

గీ. దివ్యమహిమయు, దానిమోతాదు నెఱిఁగి
యర్హమగునట్టిరోగము లందు వైద్య
వరుఁడు నస్యముఁ జేయింపవలయు నందు
వలనఁ గడుమేలు గలుగు శ్రీనరమురారి ! 136

—♦ నస్యయంత్రాకృతి ♦—

తే. నస్య మన నౌషధమ్ముల నాసికమ్ము
వలన శీర్షంబునకుఁ బంపుపనికిఁ గొను
దీన గోకర్ణశంఖసమానపాత్ర
ములును, నాళముగలయంత్రమును దగు హరి ! 137

—♦ నస్యపరిభాష ♦—

తే. నస్యకర్మకుఁ బేరగు నావన మన
ధరణి గేచననస్యభేదములు ప్రథమ

నంబు నవపీడనము, బృంహణముల భేద
ము లగు మర్శము; ప్రతిమర్శముల మురారి ! 138

తే. అవని బృంహణమునకు స్నేహనసమాఖ్య
చను; విరేచనమునకుఁ గర్షణ మనంగఁ
దనరు; వాతాదులందు రేచనము, ధాతు
వృద్ధి కలుబృంహణమ్మును హితము కృష్ణ ! 139

— రేచననస్యమువలనఁ దొలఁగురోగములు —

తే. తొలఁగు రేచననస్యమువలనఁ గుష్ఠ
మరుచి పడిసెము శిరోమయంబు నూర్ధ్వ
జత్రుగతములు పీనసాస్వరవిభేద
ములు నపస్మృతి శోఫయు జలజనయన ! 140

— రేచననస్యకల్పనము —

తే. కణయు సైంధవమేని నాగరము గుడము
నేని నుష్ణోదకమ్ములతోన నూరి
యనువుగను నస్యయంత్రమునం దమర్చి
చేయునది రేచన మ్మగు శేషశయన ! 141

— అపస్మారాదులయందు రేచననస్యములు —

ఆ. ఇప్పనార చిన్నపిప్పళ్ళు మిర్యముల్
సైంధవంబు నుష్ణజలముతోడఁ
బరపి నస్యమిడఁ నపస్మార మపతంత్రి
మున్మదంబునన్ను లురలుఁ గృష్ణ ! 142

తే. సైంధవము కోష్ఠు ముస్తబీజములు గౌర
సర్షపమ్ము లజామూత్రసహితముగను
నస్య మొనరుపఁ దండ్రియుచ్మాదము మొద
లగువికారమ్ములెల్లఁ దొలఁగు ముకుంద ! 143

—◆ రేచననస్యసామాన్య కల్పనము ◆—

తే. ఆవనూనెయు మొదలగునవియుఁ గాని
తత్సమద్రవ్యసాధితతైలములును
గాని తీక్ష్ణౌషధరజంబు గాని, చేయు
నస్య మది రేచన మ్మగు సరసనేత్ర ! 144

—◆ అవపీడన ప్రధమనార్హ రోగములు ◆—

తే. క్రిమియు గళరోగవిషమజ్వరములు సన్ని
పాతమతినిద్ర మానసోద్భవవికార
ములు దొలఁగు నవపీడనమునఁ బ్రధమన
మున నపస్మృతి సన్యాసమూర్ఛ లడఁగు. 145

—◆ ప్రధమననస్యకల్పనము ◆—

తే. వసయు మిర్యముల్ శుంఠి పిప్పలియు సైంధ
వమును వెల్లుల్లికాయఫలమును గుగ్గి
లమును కంకోలమత్స్యపిత్తములు నూర్చి
ప్రధమన మొనర్పఁ దగుజల్ వావుఁ గృష్ణ ! 146

—◆ అవపీడన ప్రధమనస్య లక్షణము ◆—

తే. కల్క మదివస్త్రమున నాసికమ్మునందు
పిండఁబడునట్టివిధి కవపీడన మని
నాళయంత్రిముతోడఁ జూర్ణముల నూదు
విధికిఁ బ్రధమనఁ మనియురు పేర్లు కృష్ణ ! 147

—◆ అవపీడనస్య ప్రమాణము ◆—

తే. అవని నవపీడనాఖ్యనస్యమ్మునందు
నష్టబిందువు లుత్తమ; మాఱు మధ్య
మంబు; నాల్గైన నది కనిష్ఠంబు గాఁగఁ
దెలియవలె దీని నెలవెద్యులు ముకుంద ! 148

—◆ నస్యకర్మయందు హీంగ్వావ్యౌషధ ప్రమాణము ◆—

క. యవమిత మింగువయును సైం
ధవమును మాషంబు తీక్ష్ణతరములు శాణం
బనని మధురములు కర్షము
వివరింపఁగఁబడియె నస్యవిధియందు హరీ ! 149

తే. పాల నటు నస్య మొనరింపవలయునేని
కర్షయుగ్మము మఱి యుదకంబ యేని
కర్షములు మూఁడు తగు నస్యకర్మ కనుచుఁ
దెలియవలయును వైద్యులు దేవదేవ ! 150

—♦ బృంహణనస్య కల్పనము ♦—

తే. బృంహణాం బిడుధాతుప్రవృత్తిః యాప్తి
కర్షయుగ ముత్తమం బగు; కర్షమిత
మధ్యమం బగు; శాణపరిమాణమిది
హీన మని యెంచి చేయుట హితము కృష్ణ ! 151

—♦ బృంహణనస్య సేవనార్హరోగములు ♦—

తే. ఘ్రాణకర్ణాక్షిభుజశిరకంఠదంత
బాహుమన్యాలలాటమర్త్యవ్యథల వాత
పైత్యపలితేంద్రలుప్తమర్భలకలందు
బృంహణస్నిగ్ధమధురముల్ వెలయుఁ గృష్ణ ! 152

—♦ మర్శప్రయోగవిధానము ♦—

ఆ. దినము విడిచి దినమునను మర్శనస్యంబు
చను నొనర్ప; లేక దినమునందె
రెండుమూఁడుమార్లు రెండుమూక్కారములఁ
జేయుటయును గలదు శ్రీశ కృష్ణ ! 153

—♦ మర్శాధిక్యజనితోపద్రవ ప్రతీకారము ♦—

తే. అధికతరమర్శజనితదోషాదులందు
వమనరేచనకర్మలు వలయుఁ జేయఁ
బ్రధమనాదులఁ గలుగుమర్త్యవ్యథలయందు
బృంహణౌషధనస్యముల్ వెలయుఁ గృష్ణ ! 154

—• బిందుసంజ్ఞకమాత్ర •—

తే. బిందు వనఁగను రెండవ్రేలి రెండు
కణువులను ముంచి పైకెత్తఁ గారునదియె;
శాణ మివి సున్మిదిదియ మర్శమున; బిందు
యుగము ప్రతిమర్శమం దిడఁ దగును కృష్ణ! 155

—• ప్రతిమర్శసనస్యకాలము •—

సీ. ప్రతిమర్శ మలరుఁ బ్రభాతకాలమునందు
వ్యాయామగమననిద్రాంతములను
మైథునాంజనభుక్తమలమూత్రనిర్గమాం
తములను, సద్మనిర్గమనములను
వమనాంతమునఁ గబళము సల్పిదవ సా
యంకాలసమయంబునందు, దంత
ధావనంబున నెన్కఁ దగియుండు; నీపదు
నాల్గుకాలంబు లెన్నఁగను దాని

గీ. జలుపుపిమ్మటఁ గొలఁదితుమ్ములును గలిగి
తైల మది కంఠగతమైన దాని లెన్న
జరుపఁబడినట్లు లెంచఁగాఁ జనును దాని
మ్రింగకుండఁగ నుమియుట మేలు కృష్ణ! 156

—• ప్రతిమర్శనార్హులు •—

క. మే లిడుఁ బ్రతిమర్శ మ్మది
బాలురకును వక్త్రశోషవశులకుఁ గృష్ణన్

దూలెడువారికి ధాతు
స్ఖాలిత్యము గలుగునట్టిజనులకుఁ గృష్ణా! 157

— పక్షవధాదుల కగు నస్యంబు —

తే. రాస్న కామంచి పుంరి యేరండయుగ్మ
మూలములు మర్కటీబీజములు మిన్నములు
నశ్వగంధియుఁ దగుకషాయమున హింగు
సైంధవమ్ములఁ గల్పి యుష్ణముగ నస్య
మిడఁగఁ బక్షవధాదులు సడలుఁ గృష్ణ! 158

— పలితము నకు నస్యము —

ఆ. విరిగి కరక తాడి వేము గుమ్మడు గురి
వెందపప్పు పిని వేఱువేఱ
మసలునూనెలోన మరిగించి వడియించి
నస్య మిడినఁ బలితనాశము హరి! 159

— నస్యవిధానము —

చ. నలునకు ధూమపానకలనం దగుచెమ్మట గొల్పి పాదముల్
కరములు సాచి వెల్లకిలఁ గంఠము వెన్కకు వంగునట్లుగా
నెరపి పరుండఁబెట్టి కడునేర్పున నస్య మొనర్పఁజెల్లు; న
త్తరుణమునందు ధూళి; యమితం బగుగాలియుఁ గీడు శ్రీ
హరీ! 160

— నస్యకర్మమునకు నిషిద్ధ పురుషులు —

సీ. నస్యకర్మగా భోజనము వేళ, లంఘన
మును మఱి జలపానాదిని, భుజించి
నశి స్నాన మొందని యవసరమ్ముల దుర్ది
నమున, మలోత్సృష్టినమ్ము గాని
దినమున, విషదోషముల, గర్భవతికి న
భ్యంజనవస్తిక్రియాన్వితులకు
స్నేహపానోదకాసవసేవితులకు వృష్టి
జాలానిలక్రోధపరవశులకు

గీ. వేగధారితులకు శోకవివశులకును
దృష్ణ గలవారి కనగాహాదిక్షితులకుఁ
జేయఁ దగ దందు; రందురుఁ జెలఁగఁగల్గు
గాన నైష్యములు పరికింపఁ గావలె హరి ! 161

ఆ. నస్యకర్మ నడసి నవ్వుట కోపించు
టయును మాటలాడుటయును శిరము
నూచుటయును వలవ దొదవు నస్యకనేత్రి
బాధ రొంప దగ్గు వచ్చుఁ గృష్ణ ! 162

— నస్యానంతరవిధానము —

తే. నస్యమొందినపిదప మనుష్యుడును
వ్యధను గూర్చక, నారులస్ఫుటాక్షరములు
పలుకక సంతతి కాలము మొలచి నగనె
వెల్లకిలగఁ బరుండఁగాఁ జెల్లుఁ గృష్ణ ! 163

—♦ నస్యమున శుద్ధాదిక భేదములు ♦—

సీ. ధరనస్యకర్మ కు త్తమయోగ హీనాతి,
యోగంబు లనఁదగియుండునందు
ఘ్రాణాస్యములఁ గఫ, స్రావంబు దనువున
గండూజడత్వముల్ గలుగు హీన
యోగంబుచే నతియోగంబునను వాత
వృద్ధియు నింద్రియవిభ్రమంబు
మస్తులుంగచ్యుతి మస్తకశూన్యత్వ
మమరునుత్తమశుద్ధియందుఁ దొలఁగు.

గీ. శ్రోత్రగుదశీర్షనాసాస్య, నేత్రరోగ
ములు మనంబును కడు వినిర్మలతఁ జెలఁగుఁ
గాన నద్దాని సమ్యగ్విధాన మెఱిఁగి
చేయవలెనండ్రు రార్యులు శ్రీశకృష్ణ ! 164

—♦ హీనశుద్ధ్యాదులకు చికిత్స ♦—

క. హీనాతియోగవికృతుల
మానుపఁ గఫవాతహరవిమల నస్యములన్
బూనఁగనగు, సమ్యగ్విధి
లో నటు, ఘృతనస్య మిడుట లుం దగు కృష్ణా ! 165

—♦ అతిస్నిగ్ధ లక్షణము, దానిచికిత్స ♦—

తే శిరము ప్రతిమర్శమున నతిస్నిగ్ధ గను
నెడలఁ గల్గుఁ గఫస్రావ, మింద్రియముల

కమరువిభ్రాంతి, జడత శీర్షమున నెరయు
నపుడు మేలిడు రూక్షనస్యములు కృష్ణ ! 166

— నస్యమునందు పథ్యములు —

తే. చనవు నస్యము సేవించు వెనుకఁ గఫక
రము లభిష్యందిగణపదార్థములు ధూమ
పాన మును; నవిగొనఁగ నపాయకరము
గానఁ దగుపథ్యవిధిఁ గూర్చఁగావలె హరి ! 167

— ధూమపానస్థానము —

తే. నస్యమును బోలి ధూమపాన మ,ది యూర్ధ్వ
జత్రుగతరోగముల నెల్ల సమయఁజేయు;
గఫము, కఫవాతదోషముల్ గడపు, దీని
గొనెడు వారల కవిరావు గోపకృష్ణ ! 168

— షడ్విధధూమములు —

తే. శమనమును, బృంహణము, రేచనమును కాస
హమును, వ్రణధూపనము, వామనము ననంగ
నాఱువిధములధూమంబు లవనిఁ జెల్లు
వానిగుణముల నెఱిఁగింతు వాసుదేవ ! 169

— శమనాది పర్యాయములు —

తే. శమనమున కొప్పుఁ బ్రాయోగికమును, మధ్య
మను ననఁగను; బృంహణమునకు స్నేహ
నమును, మృదురేచనమ్ము ననఁగ రేచ
నమున కగు శోధనంబు తీక్ష్ణమనఁ గృష్ణ ! 170

—◆ ధూమప్రయోజనము ◆—

తే. వాతయుక్తకఫంబున వాతమందుఁ
గఫమునను ధూమపానముల్ గ్రమముఁ జెల్లు
మధ్యమస్నిగ్ధతీక్ష్ణముల్ మరి దినమున
రెండు మూఁడొండు గొనఁదగి యుండుఁ గృష్ణ ! 171

ఆ. కాసహమ్మనునది కాసంబు దొలఁగించు
వామనంబు జేయు వమన మటులె
వ్రణము మానఁజేయు వ్రణధూపనము నిట్లు
తెలిసి చేయ మేలు గలుగు కృష్ణ ! 172

—◆ ధూమపానార్హరోగములు ◆—

ఉ. కాసము పీనసస్వరవికారజడత్వముఖాక్షిరోగముల్
శ్వాసము తంద్రి కర్ణగతజాడ్యము హిక్కయు శూల నాసి
కన్ । దోసము తీటయున్ బలితదోషసితాస్యత ధూమరు
వనా । ల్లెల్ల ధూమపానాసమశక్తిఁ దూలు నని యందుసే
వైద్యశిఖామణుల్ హరీ ! 173

—◆ ధూమపానానర్హరోగములు ◆—

చ. ఉదరమునందుఁ బిత్తతిమిరోర్ధ్వసమీరణమేహరోహిణీ
గదలను, వస్తిశోధనలఁ, గార్శ్యశిరఃక్షతులందుఁ, దాహదు
ర్మదములఁ, గ్రైలదుగ్ధదధిమాక్షికమద్యఘృతాదిభుక్తులం
దొదవును గీడు ధూమమిడ నొప్పరు వైద్యవిశారదుల్ హరీ!

◆— స్నిగ్ధధూమార్హకాలము ◆—

తే. స్నేహపానము దంతధావన జృంభహాస్య
మైథునక్షుతశస్త్రకర్మలఁ బిదప

మూత్రమలదోషనిర్గమములకు వెన్క-
నియతి నొనరింప మే లిడు నీరజాక్ష ! 175

—♦ మధ్యతీక్ష్ణధూమార్హకాలము ♦—

తే. మధ్యమం బనునట్టిధూమంబు నస్య
కర్మకును వెన్క-నిసి భుక్తిఁ గడపువెన్క-
నమరు; తీక్ష్ణము స్నాననిద్రాంజనవమ
నములకును వెన్క- గుణదాయకము మురారి ! 176

—♦ ఉ చి త ప ద్ధ తి ♦—

తే. స్నిగ్ధనస్యమునకు వెన్క- స్నిగ్ధధూమ
ములె మధ్యాహ్నసమయభుక్తాంతములను
మధ్యమ మ్మనునట్టిధూమమును సుప్తి
నస్యముల వెన్క- తీక్ష్ణ మెన్నఁబడుఁ గృష్ణ ! 177

—♦ అకాలదోషము తత్ప్రతిక్రియ ♦—

తే. ధూమపానము నియతిని దొలఁగి చేయ
మూర్ఛయును దప్పి బధిరము మోహమదము
లంధతయు రక్తపిత్తము నడరు; నింపుఁ
దగు ఘృతస్నాననస్యశీతలములు హరి ! 178

—♦ ధూమయంత్ర నిర్మాణాదులు ♦—

సీ. ధూమయంత్రము లోహసామజదంతదారు
వంశనాళముల నిర్వక్రదీర్ఘ
ఘర్షబహుళతల, బదరాస్థితుల్యరం
ధ్రముగల్గి మధ్యనామమున నలువ

దియుఁ దీక్ష్ణమౌ దిరవదియునాఁగ స్నిగ్ధము
నందు ముప్పదియు రెండంగుళములు
నిడుపున దగునట్లు నిర్మించి, శిరామునకు
యల కొప్పునటి కల్కములుగ మూసి
గీ. చిక్కఁబడఁజేసి దాని నిషీకమునను
నలది యెండించి యందుండి వెలికిఁ దీసి
యాజ్యమున ముంచి యంత్రమధ్యమున నుంచి
నిప్పు ముట్టించి పొగఁ బీల్చు టొప్పుఁ గృష్ణ ! 179

— ధూమవర్తి నిర్మాణక్రమము —

తే. అడుగుపొడుగునఁ దగునట్లు పుడకయందు
తులముకల్కము నెన్మిదంగుళములపొడ
వుండునటు వ్రాసి, యట్టాని నెండ బెట్టి
గుల్ల నందుండి వెడలింపఁ జెల్లుఁ గృష్ణ ! 180

— స్నిగ్ధధూమ ద్రవ్యములు —

సీ. అగురు గుగ్గులు ముస్తె యందుగు కరువేరు
యష్టి సర్జరసము యవలు తిలలు
మారేడుగుజ్జును మఱ్ఱిగ కుంకుమపువ్వు
కలుజువ్వి కుందురుష్కమును చండ్ర
వస వేగిసయు మజ్జవట్టివేరును రేణు
కలు మిన్నులుచు గొండగోలుగు రాత్రి
పువ్వునుకామంచి పూరి మేదస్సును
గూతురుబుడమయి గోఘృతంబు

గీ. పరఁగు శ్రీవేష్టకంబు కొబ్బరి లవంగ
చెక్కయును మాచిపత్రియు స్నిగ్ధధూమ
మునకుఁ దగినట్టి వస్తువులనుచుఁ దెలియ
వలయు నివె భువి బృంహణములు మురారి ! 181

—♦ శమనధూమ ద్రవ్యములు ♦—

చ. చక్కెర బొంతయేలకులు సల్లకి తామర నల్లకల్వలున్
లక్కయు మజ్జ లొద్దుగు పలచ్ఛద పిప్పల యజ్ఞపాదప
త్వక్కులు హేమవల్కలముపౌష్కరమున్ మధుకంబు కో
ష్ఠు మెం। పెక్కడునట్టిశామకము లియ్యవె మధ్యమసంజ్ఞ
లౌ హరీ ! 182

—♦ తీక్ష్ణధూమ ద్రవ్యములు ♦—

తే. గ్రంధితగరము లక్క చెంగల్వకోష్ఠు
శిలయు దశమూలములును త్రిఫలము లతివ
సయును మాల్కంగిణియును పసపును శీర్ష
రేచకములును తీక్ష్ణములై చనుహరి ! 183

—♦ వామనకాసహృధూమ ద్రవ్యములు ♦—

తే. జంతుఖురములు శృంగముల్ స్నాయుచర్మ
శల్యముల్ మొదలుగఁ జేర్చి సలుపుధూమ
మదియె వామన మగు, కాసహరము లెంచి
చేయునది కాసహం బగు శ్రీశకృష్ణ ! 184

—♦ వ్రణధూపన ద్రవ్యములు ♦—

క. వ్రణధూపనమ్ము లాయా
వ్రణములకుం దగిన వేమువస మొదలగువా

నిని నస్యనిడి వెడలుపోగ
వ్రణములకన్ బ్రసుచంద్రు వలయుచు మురహారీ ! 185

— గ్రహ నాశన ధూమము —

గీ. పత్రి గింజలు మిర్యముల్ బ్రహ్మసింఘ
మింగువయు గొఱ్ఱెవెండ్రుక లేనుకొమ్ము
సర్పనిర్మోక మాంసిమార్జాలమలము
లాజ్యముం గూడి గ్రహముల నడచు కృష్ణ ! 186

— ధూమసేవనార్హకాలము, తత్ఫలము —

చ. క్రమమగు ధూమపానమున గ్రాలెడు నింద్రియమానసంబు
లున్। విమలదృఢత్వసంపదల; వృద్ధిగ చున్ దలకట్టుతోడమీా
సములును; దంతముల్ ముఖము సౌరభతన్ విలసిల్లు; ద్వా
దశాబ్దములకుం బైనశీత యుచితంబగు ధూమమొసర్పగాహరీ!

— ధూమపాన క్రమము —

తే. ముఖమునం బీల్చుధూమము ముక్కువెంట
ముక్కునం బీల్చునద్దాని ముఖము వెంట
విడువఁదగు దీనఁ గడుమేలు వెలయు నుభయ
మార్గములు శుద్ధిగనును రమావినోది ! 188

— ధూమపానమున పథ్యాపథ్యములు —

తే. నస్యవిధిఁబోలె ధూమమునకును బథ్య
మిడఁగఁ జెల్లును వానియం దిడఁగఁ దగని
వాని విడువంగఁ దగు; నిట్టులూని నడుప
విమలగుణ మిచ్చు ధూమపానము మురారి ! 189

— గండూషకబళవిధానము —

తే. శమనరోపణశోధనస్నైహికాఖ్య
లలర గండూషములు నాల్గునలు దెఱంగుల
నిట్లె కవలభేదంబు లెసఁగు; వీని
కల్పవి తెలియఁగఁ బల్కెదఁ గమలనయన ! 190

— చతుర్విధగండూషప్రదానవిధానము —

సీ. స్నిగ్ధోష్ణములను సంసిద్ధమౌ స్నైహిక
గండూషమున వాతగదల నడచు
శీతలమధురసంసిద్ధమౌ గదిప్రసా
దనశమనాఖ్యలఁ దనరి పైత్య
ములఁ బాపు; కారమున్నను పుల్పు నుష్ణము
లను దగి శోధనంబనఁ గఫంబు
బోలఁగించు; వగరు చేఁదును మధురంబును
గలసి రోపణనామకమున వ్రణము
గీ. నార్పునది యగు; గండూష మన ద్రవములఁ
బుక్కిలించుచు నుమియుట; పొసఁగ నట్టి
వాని కల్కాదులను నోటఁ బట్టి నమలి
యుమియుటయొకవలనమగు నుర్విఁ గృష్ణ ! 191

— కషాయమునందు మాత్రాదుల చేర్చువిధానము —

తే. అవని గండూషకల్పసం బగుకషాయ
ములను జూర్ణము కలుపంగవలయు నేని
యరతులంబును, గవలనమందుఁ గల్క
ముం దనెడఁ దులమును జేర్చి పొప్పుఁ గృష్ణ ! 192

—◆ గండూషము మొనర్ప వలసియుండు కాలము ◆—

ఆ. కఫము నోటనుండి కర్పిమ్మురునపు కాన్క
గళశిరములఁ జెమట గలుగునపుడు
ఘ్రాణనయనములను స్రావమయ్యెడి నం-
కొప్పు దీనిఁ జేయ సురిపిఁ గృష్ణ ! 193

ఆ. పంచవర్షములకుఁ బైఁబడువారికిఁ
దగు నొనర్ప దీని; మిగులఁ గాక
మూడు నైదు గాక, యేడుమారులు మించ
కుండునట్లుఁ చేయు టుచితము హరి ! 194

—◆ వాతమునకు స్నేహికగండూషము ◆—

క. పాలును దిలకల్కంబును
తైలము మొదలైనయట్టి ద్రవ్యంబులన
మ్మేళనములు స్నేహికములు
తోలును వాతాదుల నివి తోయజనేత్రా ! 195

—◆ పిత్తాములకు శమనగండూషము ◆—

క. పాలును జక్కెర నువ్వులు
నీలోత్పలమును ఘృతంబునిర్మలమునను
మ్మేళనమున శమనంబగుఁ
దూలుచు బిత్తములఁ నిది యనోక్షజ కృష్ణా ! 196

—◆ ముఖ వ్రణాములయందు గండూషము ◆—

తే. తేనె గండూష మొనరింప మాను నోటి
పుండ్లు తాపము దప్పియుఁ, బుల్లకలిని

బుక్కిలించిన విరసత పోవు, నాస్య
శోషమణఁగించి సుఖ మిడుఁ శుభకర హరి ! 197

—♦ దంతచలనాదులకు గండూషము ♦—

తే. తైలమున సైంధవముఁ జేర్చి దంతగదల
నాఙ్యమేనియుఁ బాఁలేని నగ్నిదగ్ధ
జన్యవికృతుల విషదోషజనితములను
జేయుగండూష మది మేలు చేయుఁ గృష్ణ ! 198

—♦ కఫహరగండూషము ♦—

తే. సైంధవము శుంఠి పిప్పళ్లు సర్షపములు
మిర్యములు గుండ గావించి మిఱిగ దాని
నల్లపురసంబుతోడ నైక్యంబు జేసి
పుక్కిలింపఁగఁ గఫమది పోవుఁ గృష్ణ ! 199

—♦ రక్తపిత్తమునందు గండూషము ♦—

తే. త్రిఫలచూర్ణముగలిసిన తేనెతోడ
వెలయు గండూషకవలముల్ వింత దోష
శ్లేష్మమును రక్తపిత్యముఁ రెండు నరుచి
దొలఁచు విరసత్వమును బాపుఁ దోయజాక్ష ! 200

—♦ ముఖపాకమునకు గండూషము ♦—

తే. త్రిఫలములు జాజిపూవులు త్రిప్పతీఁగె
దారువిశెగపాలగో వెల ద్రాక్షసిరి
క్వాథముఁ దేనె నాజనవంతు గల్పి
యీవన్నముఁ దాల్చ ముఖపాక నణఁగుఁ గృష్ణ ! 201

—♦ గండూష భేదమగు ప్రతిసారణము ♦—

తే. అవని గండూషసంసేవనార్హ ము లగు
నట్టివాసిని జూర్ణకల్కావలేహ
భేదముల నాస్యజిహ్వల వ్రేలితోడ
నలదఁ బ్రతిసారణ మ్మగునండ్రు కృష్ణ ! 202

—♦ కవళనవిధానము ♦—

తే. సైంధవమును మాధిపలకేసరములు త్రిక
టుకము లివి కల్కసరణి నుండునటు చేసి
కవళన మొనర్ప మారుతకఫసముద్భ
వంబగు నరోచకం బడివాయుఁ గృష్ణ ! 203

—♦ ప్రతిసారణమార్గము ♦—

చ. అరుణనిశాద్వయాంబుదము లామయమున్ జిరుబొద్ది చాగ
యున్ । వరకటుకంబు లోధ్ర సమభాగములన్ బొడి చేసి
యుక్తమా । సరణిని వక్త్రమందుఁ బ్రతిసారణఁ జేయఁగ
దంతరోగముల్ । పరుగిడు నాస్యపాక ముఖు సాయు రుచిన్
గలిగించు శ్రీహరీ ! 204

—♦ శుద్ధగండూష లక్షణము ♦—

తే. శుద్ధగండూషమున వక్త్రశుద్ధి గల్గు
నామయమడంగు; సకలేంద్రియములు మనము
గను బ్రసన్నత్వ; మిద్దానిక్రమ మెఱింగి
చేయకున్నను వికృతిని జేయుఁ గృష్ణ ! 205

—♦ హీనాతియోగములగలుగు లక్షణములు ♦—

క. మితిమీఱిన ముఖపాకం
బతిదాహము శోష గలుగు; నతిహీనమునం
దతికఫ మరుచియు రసహీ
నతయగు గండూషకవళనములం గృష్ణా ! 206

—♦ ఉపకర్మనిరూపణము ♦—

తే. పంచకర్మల నొనరుచువారు నియతిఁ
దొలుత స్నేహము స్వేదంబు తుదిని ధూమ
పానగండూషములు చేయవలయు నివియ
నాల్గు నుపకర్మ లనఁబడు నళిననేత్రి ! 207

ఇది

శ్రీమత్త్రిపురసుందరీ కరుణాకటాక్ష సంప్రాప్తకవితావిదితా
యుర్వేదవిద్యోపపన్నైత్రలోహితసగోత్రపవిత్ర, వెంక
టేశ్వరా వధూతప్రపౌత్ర, నారాయణపౌత్ర,
సూర్యనారాయణపుత్ర, శ్రీపార్వతీపర
మేశ్వర సేవాపరాయణ, సూర్య
నారాయణకవిప్రణీతం బైన
యభినవ చికిత్సారత్నాక
రాంతర్గతపంచకర్మవిధాన
మను ద్వితీయతరం
గము సర్వము
సంపూర్ణము,

---

# తప్పొప్పులు.



| పేజీ | పంక్తి. | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| 3 | 2 | పడజెడు | పడయగ |
| 3 | 3 | పాత్రిశద్ధశ | పాత్రిశస్థశ |
| 4 | 3 | దివము | దిసమున |
| 5 | 20 | దగువంద్రు | దగునంద్రు |
| 7 | 11 | నిలయము | నియమము |
| 16 | 15 | నా | నౌ |
| 49 | 13 | కన్దోస | కాదోష |
| ,, | 14 | యందుపే | యందురు, |
| ,, | ,, | ధూమరువనా | (విడిచి చదువవలెను ) |



ఓమ్

# మాధవ నిదాన శేషము

మొదటి కూర్పు 1000 ప్రతులు

గ్రంథకర్త:

"రాజవైద్య" ద్విభాష్యం వేంకటరావు

# మాధవ నిదాన శేషము

(ఆంధ్రతాత్పర్యసహితము.)

'రాజవైద్య' ద్విభాష్యం వేంకటరావు

గ్రంథకర్త.

మొదటికూర్పు 1000.

ప్రకటనకర్త:

'రాజవైద్య' ద్విభాష్యం వేంకటరావు,

మండపేట,

తూర్పు గోదావరిజిల్లా.

 [వెల రు. 1—0—0.

# తొలి పలుకు.

ఆయుర్వేదవైద్యాభిమానులారా!

భరతఖండమునందు బ్రిటిష్వుపరిపాలనారంభమునుండి నేటి వఱకు వర్ణాశ్రమాచారధర్మములతోబాటు ప్రాచ్యవిద్యలన్నియును మార్పు నొందియున్నవి. ప్రాచీనకాలమున ఋషిపుంగవులు నాల్గువేదములతోబాటు ఆయుర్వేదమునుకూడ సర్వతోముఖముగ విస్తరించుట కుపకరించుట కపూర్వగ్రంథములను సృజించియున్నారు. అట్టిగ్రంథము లన్నియు కాలవశంబునను, సహాకారశూన్యంబునను ప్రజాదరణంబు నందలేక మాటువడియున్నవి. ఇట్లగుటకు హేతువులను గుచ్చిగ్రుచ్చి పరిశోధించి వ్రాయు టప్రస్తుతము. ఏది యెట్లున్నను ప్రాచ్యవిద్య లన్నియు నటుగంటినవని తెలుపుటమాత్రము సత్యదూరము కాదు. ఆయుర్వేదమునం దిక్కాలమున నేపఁడవర్తంబుననో అభిమానులును, ప్రోత్సాహకులును, ఇంచుక తలయెత్తిరనుట నిర్వివాదాంశము. అట్టివారి కందుబాటులో నుండదగిన మహత్తరగ్రంథరాజములనేకములు గలవు. కొన్ని ప్రాచ్యలిఖితగ్రంథభాండారములందు, విద్వత్పుంగవులగృహంబులందు, పండితపుత్రులప్రాంగణములందు వేలువేలు అవస్థలతో నల్లాడుచున్నవి. అట్టివాని నుద్ధరింప యత్నింపవలెనన్న ధనరాశులు గావలయును. ధనవంతు లీపనికి పూనుకొందురనుట కలలోనివార్త. కావున నాయుర్వేదమునను, ఆంధ్రగీర్వాణంబులందును పాండిత్యమును సముపార్జించినవారేదో యొకసహాయముననో, సాహసముననో యత్నించిన కృతార్థులగుటయేగాక లోకోపకారులుకూడ నయ్యెదరని వచించుట సాహసము గాదు.

అప్పట్టున నాయుర్వేదమునందు పూర్వులు 'నిదానం మాధవ శ్రేష్ఠం' అని వచించియున్నారు. అయ్యది యదార్థమే యైనను, అందుగూడ కానరాని రోగనిదానము లెన్నియో, ఆయుర్వేదగ్రంథములందు కలవు. అవి సంస్కృతభాషలోనుండి కొన్ని వ్యాఖ్యానరహితములుగ నున్నవి. జనసామాన్యమునకు వాని నందుబాటుగా నొనర్చుటయే ముఖ్యాశయముగ నుంచుకొనిన నేను ఆయా ప్రాచీనములగు నాయుర్వేదగ్రంథములను పరిశీలించి, పరిశోధించి, నిదానముల నన్నిటి నొక్కచో బహువ్రియాసమున కోర్చి ఏర్చి కూర్చి యథాశక్తిగ నాంధ్రితాత్పర్యమమర్చి "మాధవనిధాన శేష" మను నీగ్రంథమును ప్రచురించితిని. ఈగ్రంథము వ్రాయుటకు ఆయుర్వేదవిజ్ఞానము, భావప్రకాశిక మొదలగు సద్గ్రంథములు నాకు సాయపడినవి. ఇది ఆయుర్వేదము నభ్యసించు విద్యార్థులకును, వైద్యులకును మిగుల నుపయోగకరముగ నుండకపోదని నాయాశయము. దీనిని ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారు చికిత్సపూర్వకనిదానము నభ్యసించు విద్యార్థులకు పఠనీయగ్రంథముగ నేర్పరచి నాయీయుద్యమమునకు చేయూత నొసంగుదురుగాకయని విన్నవించుచున్నాను. నాకు జిన్నతనమునుండియు నాయుర్వేదవిద్యను గరిపి నాయున్నతికి హేతుభూతులైన "వైద్యరాజ," బ్ర॥శ్రీ॥ ద్విభాష్యం వెంకటేశ్వర్లుగారికి దీనిని కృతిగ నర్పించుచున్నాను.

ఇట్లు
బుధజనవిధేయుఁడు
"రాజవైద్య" ద్విభాష్యం వేంకటరావు.

## —: కృతిసమర్పణము. :—

---

దయ యొలుకంగ దిద్ది నిరతంబు సుతుంబలెఁ జేఁదీసి య
వ్యయనిజసత్కళాగరిమ మాదట నేరిపి నాఁకు నెల్లెడన్
జయమగునట్లు దీవనల సల్పు ద్విభాష్యము వెంకటేశ్వరా
హ్వాయభిషగన్వయప్రభున కర్పణఁ జేసెద భక్తి నీకృతిన్॥

# విషయసూచిక.



—[o]—



శ్రీ ధన్వంతరిణే నమః.

# మాధవనిదానశేషము.



## యోషాపస్మారనిదానమ్.

శ్లో. శోణితస్య క్షయాద్వాపి తథాధిక్యా దజీర్ణతః।
కోష్ఠరోధా న్మనోభఙ్గా దత్యుద్వేగాచ్చ శోకతః।
రజోఽభావాచ్చ యోషాణాం జరాయువికృతే స్తథా।
అశక్తేరపి నైష్ఠుర్యాత్ పత్యురస్నేహతస్తథా।
వైధవ్యశోకహేతోశ్చ యోషాపస్మారసంజ్ఞకః॥
గద స్సఞ్జాయతే కృచ్ఛ్రో మనోదేహప్రతాపనః।
యోషితామేవ బాహుళ్యాత్ యతఏష భవేద్గదః।
అపస్మారస్వరూపశ్చ తేనాఖ్యాతా దృశా మతా।
కాలోఽస్య యాపనం వ్యాధే ర్నార్యాగ్ ద్వాదశవర్షతః।
పరంపఞ్చాశతో వర్షాద్వాపి నార్యాగి నేష ప్రజాయతే॥

పూర్వరూపమ్.

శ్లో. హృత్స్ఫురిజా జృమ్భణాసాదో వర్ష్మణో మనసోఽపిచ।
భవేత్స్మృతివిస్మృతిర్గదే యోషాపస్మారసంజ్ఞకే॥

## అస్య లక్షణమ్

శ్లో. వైచిత్ర్యం బుద్ధివిభ్రాన్తిర్హాస్యం క్రన్దన మేవచ।
ఉచ్చైః క్రోశః ప్రలపనం జ్యోతిర్ద్వేష స్తథా భ్రమః।
ఔద్ధత్యం శ్వాసకృచ్ఛ్రశ్చ కణ్ఠా మాశయవేదనా।
ప్రాబల్యం స్పర్శశక్తేశ్చ క్వచిదజ్ఞేసదా వ్యథా।
అలీకవర్తులోత్థాన మాకణ్ఠ ముదరా దపి।
సదల్పం బుద్ధిమూర్ఛాచ వ్యాధా వస్మిన్ ప్రజాయతే॥

తా. రక్తధాతువుయొక్క వృద్ధిక్షయములు, అజీర్ణము, మలబద్ధము, ఆశాభంగము, మిక్కిలిదుఃఖము, విశేషశోకము, ఋతుబద్ధము, ప్రసవించినపుడు జరాయువు పూర్తిగ వెడలక నిలచియుండుట, దౌర్బల్యము, కఠినవాక్యశ్రవణము, భర్త అనుకూలుడుకాకుండుట, స్నేహవ్యయముచే కలిగినశోకము వీనివలన మనస్సును, దేహమును పీడించు యోషాపస్మారమను వ్యాధి తరచుగ స్త్రీలకే కలుగుచున్నది. కనుకనే యీవ్యాధి యోషాపస్మారమని పండితులచే చెప్పబడుచున్నది. ఈవ్యాధి స్త్రీలకు పండ్రెండుసంవత్సరములకు లోపునగాని యేబది సంవత్సరములకు పైబడిగాని కలుగదు యౌవనమందే కలుగును.

గుండెపోటు, ఆవలింతలు, శరీరమునకు, మనస్సునకు బడలిక మొదలైనలక్షణములు యీవ్యాధికి పూర్వరూపములు.

విపరీతమైన చేష్టలు, బుద్ధిభ్రమించుట, నవ్వుట, ఏడ్చుట, బిగ్గరగా యేడ్చుట, కేకలు, దీపమునుచూచుటయందు ద్వేషము, మనశ్చాంచల్యము, అతిశయభావము, శ్వాససరిగా ఆడకుండుట, కంఠమునందు, ఆమాశయమునందు నొప్పి, స్పర్శచేతనే బాధకలుగుట, ఎవరైన అనుమానము నందెల్లపుడును

పీడ, కుక్షి మొదలు కంఠపర్యంతము పంజరగాను, సుందరముగాను మెట్టు కొనుట, బుద్ధిసన్నగిలుట, వాంతి వెక్కిళ్లు లక్షణములు ప్రాప్తియుండు కలుగుచుండును.

## —♦ శైశవసన్యాసనిదానమ్ ♦—

శ్లో. దుష్టస్తన్యస్యపానాచ్చ సదా శీతగృహే స్థితేః।
వాతాతపవిహీనే వా దుష్టానిలవిదూషితే
పానాశనవిహారైశ్చ దోషలై ర్బహుభి శ్శిశుః।
సన్యాసాఖ్యేన రోగేణ పీడ్యతే క్రిమిభి స్తథా।
ఉత్తారనయనస్సన్యా దాక్షిప్తాఙ్గ స్త్వసంజ్ఞికః।
దారువ త్పతితో భూమౌ దృఢకాయో మృతోపమః।
నామ్నా శైశవసన్న్యాసో గదోఽయం శిశుపీడకః
క్రియా సద్యః ఫలాచాత్ర విరేచనఞ్చ హితం మతమ్॥

తా. దుష్టస్తన్యపానము, చెమ్మయింట నివసించుట, గాలి, యెండ చొరనిగృహమందుండుట, దుష్టమైన గాలివీచు ప్రదేశమునందు నివాసము, దుష్టమైన ఆహారవిహారములు సేవించుట, క్రిములు, యీకారణములచే శిశువులకు తరుచుగా శైశవసన్యాసమను రోగము కలుగును.

గ్రుడ్లుమీదికివేయుట, అంగములు చలించుట, స్మృతిలేకుండుట, కర్రవలెపడియుండుట, దృఢకాయము గలిగియు చచ్చినట్లు పడియుండుట, మొదలగులక్షణములు యీవ్యాధియందుండును. ఈవ్యాధి శిశువులకే జనించును. యీరోగమునందు ముందుగ విరేచనము జేయించుటవలన కొంత వుప శాంతి కలుగును,

## —♦ స్మరోన్మాదనిదానమ్. ♦—

శ్లో. ఉన్మాదో దయితాఽప్రాప్తే శ్శుక్రస్య వికృతేరపి।
జననేంద్రియదోషాచ్చ వైగుణ్యా దనిలస్యచ
పురుషస్య తథా నార్యాః స్మరోన్మాద ఇతీరితః॥

### తస్యలక్షణమ్.

శ్లో. స్తబ్ధతా లేపనం శ్వాసః ప్రలాపః పాణ్డుతా త్వచి।
అధైర్యం రోదనం చిన్తా లక్షణంస్మరజే మదే॥
చక్షూరాగస్తదనుమనస స్సంగతి ర్భావనాచ।
వ్యావృత్తిస్స్యా త్తదనువిషయగ్రామతశ్చిత్తఖేదాత్।
నిద్రాచ్ఛేద స్తదనుకృశతా నిస్త్రపత్వం తతోఽప్యు
న్మాదోమూర్ఛా తదనుమరణం స్యుర్దశా స్తత్క్రమేణ॥

తా. వలచినస్త్రీ లభింపకుండుటచే పురుషునకు, వలచిన పురుషుడు లభింపకుండుటచే స్త్రీకిని స్మరోన్మాదము కలుగును. శుక్రముయొక్క వృద్ధి, అంగదోషము, వాతదోషము వీనివలన స్త్రీ పురుషులకు స్మరోన్మాదము జనించును.

ఈవ్యాధియందు మాంద్యము, కంపము, శ్వాస, ప్రలాపము, శరీరము తెల్లబారుట, అధైర్యము, ఏడ్చుట, మనశ్చింత కలుగును. కండ్లయందుఎరుపు, మనస్సునందు స్త్రీని తలచుట, స్త్రీని కలసినట్లు భావించుట, ఒకప్పుడు స్త్రీవిషయమునుండి మనోవృత్తిని మరల్చుట, నిద్రపట్టకుండుట, కృశించుట, సిగ్గులేకుండుట, ఉన్మాదము, మూర్ఛ, మరణము లోనగులక్షణములు కలుగును.

## —♦ తాణ్డవరోగనిదానమ్. ♦—

శ్లో. అత్యాతజ్కా దతిశోధా దతిహర్షా ద్బలక్షయాత్।
కర్షణాత్ స్వప్నరోధాచ్చ విడ్బన్ధాత్ క్రిమిసఞ్చయాత్।
ఆశానాశా దభిఘాతాత్ స్త్రీణామృతువిపర్యయాత్।
కశేరుకాన్తర్మజ్జాయా శోషగ్రిభావాత్ ప్రజాయతే।
వ్యాధిస్తాణ్డవనామాస ప్రాణినాం క్లేశకృత్పరః
అజ్గానాం తాణ్డవా దస్య తాణ్డవాఖ్యా బుధైః కృతా।
కైశోరే వయసిప్రాయః స్త్రీణాఞ్చాపి విశేషతః।
వ్యాధి రేషోఽభిజాయేత వృద్ధానాఞ్చ బలక్షయాత్।
వామబాహుం సమారభ్య ప్రాయ ఆదౌ తతోఽపరమ్।
తతః పాదౌ తతోఽఙ్గాని చాలయేత్ తాణ్డవామయః।
ముష్టినా కిమపి ద్రవ్యం సమ్యగ్ధారయితుం క్షమః
సమర్పయితు మాస్యేవా హ్యదనీయం న తాణ్డవీ
నృత్యన్నివ చలత్యేష భీభత్సై ర్ముఖచేష్టితైః।
అధీర స్సతతం తిష్ఠే న్నిద్రాప్రాయా న్నివర్తతే॥

తా. కార్యనిరోధము, యెక్కువకోపము, యెక్కుడు సంతోషము, దౌర్బల్యము, కృశించుట, నిద్రలేకుండుట, మలబద్ధము, క్రిమి, ఆశాభంగము, పడుట యీకారణములచే తాండవరోగము కలుగును. స్త్రీలకు అక్రమఋతువువలన కలుగును. వెన్నెముకవంగుటచేతను, మిక్కిలి శ్రమసమువలన గూడ విశేషముగా క్లేశపరచు యీతాండవరోగము కలుగుచున్నది. అంగములు తాండవించుట (ఆడుట)చే యీవ్యాధి తాండవరోగమని పిలువబడుచున్నది. ఈవ్యాధి స్త్రీలకు పిన్నవయస్సునందే విశేషముగ కలుగుచున్నది. వృద్ధులకు

బలక్షయములను కలుగును. తాండవరోగి తొలుత యెడమచేయి, పిమ్మట కుడి చేయి తదుపరిపాదములు, పిదప యితరావయవములు చలింపజేయును. పిడికిలి చేత యేవస్తువును పట్టుకొనుటకుగాని, యిచ్చుటకుగాని, నోటియందుంచు కొనుటకుగాని సమర్థుడు కాడు. ఈరోగి భయంకరములైన ముఖవికారము లచే నాట్యముచే నాట్యము చేయుచున్నవానివలె కదలును. ఎల్లప్పుడును వీరికిపందవలె నుండును. నిద్రావస్థయందు మాత్రము అంగచలన ముండదు.

## సోమరోగమూత్రాతిసారనిదానమ్.

శ్లో॥ అవ్యాయామో విలాసిత్వం గుర్వాభిష్యన్ది భోజనమ్।
ప్రధ్యానం మైథునం మద్యం దుష్టామ్బు గుడవైకృతమ్।
అభిచారిక దోషశ్చ భయ శోకా గరస్తథా।
మర్మాభిఘాతో యకృద్దుష్టి స్నాయుమండలవైకృతమ్।
దివానిద్రాతినిద్రా వా శుశ్రూషా రోగిణాంసదా।
చిరకాలైకవిధే కార్యే మానసే మనసస్స్థితిః।
ఉష్ణాభితప్తదేహస్య తత్‌క్షణం శీతసేవనమ్।
నియతం నగరే వాసస్తథా వేగవినిగ్రహాః।
ఏతైరేవంవిధైరన్యైః కారణై రతిసేవితైః।
ఆప స్సర్వశరీరేభ్యః క్షుభ్యన్తి ప్రస్రవన్తి చ।
తస్మాత్తాః ప్రచ్యుతా స్థానాన్మూత్రమార్గం వ్రజన్తి చ।
ప్రసన్నా స్సుసితా శ్శీతాః నిర్గన్ధా నీరుజ స్సితాః।
దుర్గన్ధా మన్దదాహా నా చాతిమాత్రం స్రవన్తి చ।
అహోరాత్రే మూత్రమానం యావత్ ప్రస్థచతుష్టయమ్।

రాత్రిపర్యుషితం మూత్రముపయాచ్ఛ మధోఘనమ్।
సకర్ణికాః పిడకా దుష్టక్షతో వా చర్మసంక్షయః।
జాయతే మూత్రమార్గే చ రోగీ సీదతి చాధికం।
గాత్రదాహోఽధికా తృష్ణా జిహ్వా శుష్కా సకణ్టకా
తీక్ష్ణాగ్నిరగ్నిమాన్ద్యం వా కృశతా గాఢవిట్కతా
త్వగ్రుక్షా మ్లాననేత్రత్వం పేశీ శిథిలకోమలా।
శిరోఘూర్ణనమాలస్యం పఙ్క్యచో హృదయస్య చ।
అశక్తిర్మైథునే వాపి స్త్రీష్వహర్షో బలక్షయః।
ఉద్వేగో ముఖమాలిన్యమరతి స్సర్వకర్మసు।
మేదక్షయోఽతిమాత్రన్తు ముఖతాలు విశోషణమ్
సోమరోగ ఇతి జ్ఞేయో దేహే సోమక్షయాన్నృణామ్।
సోఽతికాన్తః క్రమేణైవ స్రవేన్మూత్రమభీక్ష్ణశః।
మూత్రాతిసారమప్యేవం తమాహుః బలనాశనమ్।
తేన తృష్ణాభిభూతోఽసౌ జలం పిబతి చాధికమ్।
మూర్ఛాప్రలాపవీసర్పదుష్టవ్రణక్షతక్షయైః।
అపి శేన్మరణం రోగిచా భిన్న్యాసాద్యుపద్రవైః।
నిదాఘే జాయతే రోగీ నిదాఘే చ ప్రకుప్యతి।
కదాచిచ్ఛీత కాలే వా జాయతే దారుణో హి సః।
నిదానైర్బహుమూత్రోక్తైర్మధుమేహోఽపి జాయతే॥

తా. వ్యాయామము లేకపోవుట, శృంగారచేష్టల యందు నిమగ్నుమగుట, బలిష్టమైనట్టియు, నిలవయున్నట్టియు ఆహారము సేవన, గొప్పఆలోచన సేయుట, అతిమైథునము, మద్యపానము, దుష్టమగుచుండు ప్రాకృతు, తమ

పదార్థసేవన, సాంక్రామిక (సుఖరోగ) దోషములు, భయము, శోకము, పెట్టుమందు, మర్మావయవములకు దెబ్బతగులుట, యకృద్దోషము, నాడీమండలముయొక్క వ్యత్యాసము, పగటినిద్ర, అతినిద్ర, రోగులకు నిరతముసేవ చేయుట, చిరకాలము నేకకార్యమునందు మనస్సుతోపని సేయుట, అదివేడి చేసినప్పుడు వెంటనే శీతలోపచారము చేయుట, ఎల్లప్పుడును పట్నమునందు నివసించుట, మలాదివేగనిరోధము సేయుట, యీ మొదలగు కారణములచే సర్వశరీరమునందు గల యుదకము తపించి మూత్రాశయమునుపొంది నిర్మలముగను, శ్వేతధాతువు కలసియును, చల్లగను, గంధరహితముగను, పీడ లేకను, తెల్లగను, దుర్గంధముగను, శ్రద్ధమంటగయును, యెక్కువగా మూత్రద్వారమునుండి స్రవించును. రాత్రింబవళ్ళు వెడలు మూత్రము నాలుగు ప్రస్థముల పరిమితి గలిగియుండును. రాత్రిభాగమున వెడలుమూత్రముయొక్క పైభాగమున స్వచ్ఛముగను, అడుగుభాగమున మడ్డిగ నుండును. మూత్రనాళమున దురద, కురుపులు, దుష్టమైనపుండ్లు, చర్మమూడుట కలిగి రోగి నిత్యమును బాధజెందుచుండును. శరీరతాపము, తృష్ణ, నాలుకయెండుట, నాలుకముల్లుబారియుండుట, యెక్కువ ఆకలిగలిగియుండుట, లేక బొత్తిగా ఆకలి లేకపోవుట, శరీరకృశత్వము, మలబద్ధము, చర్మము గరగరలాడుట, నేత్రములు వాడియుండుట, పేశీలయొక్క మృదుత్వము చెడుట, తలత్రిప్పు, ప్రాలుమాలిక, స్థిరచిత్తత్వము లేకుండుట, మైథునమందు అశక్తత, స్త్రీలయందు విముఖత్వము, బలక్షయము, ఆవేశము, ముఖమాలిన్యము, యేపనిచేయకుండుట కుతోచకుండుట, వేదస్సునశించుట, ముఖము దపదలుపియెండుట, యీలక్షణములతో కూడియుండునది సోమరోగమని తెలియవలయును. ఇట్లుసర్వదా మూత్రము వెడలి శ్వేతధాతువు నశించినపిమ్మట సోమరోగమని, మూత్రాతిసారమని చెప్పబడును. రోగి యెక్కుడు తృష్ణకలిగి అధికముగా వుదకమును పానము చేయును. మూర్ఛ, ప్రలాపము, విసర్పి, దుష్టవ్రణములు, సన్నిపాతము యీవుపద్రవములు కలిగి రోగి మృతినొందును. ఈవ్యాధి గ్రీష్మఋతువులో జనించి గ్రీష్మఋతువులలోనే ప్రకోపించును. ఒకానొకప్పుడు శీతకాలమునకూడ యీ వాయుతుమైన రోగముజనించును. ఈబహుమూత్రముచే మధుమేహముకూడ పుట్టుచున్నది.

## —♦ అపదార్థగదనిదానమ్ ♦—

### స్వరూపము.

వినా వ్యాధిం వ్యాధిశఙ్కా గదోద్వేగ ఇతీరితః।
పదార్థత్వాభావవత్వా దపదార్థ గదశ్చ సః।
కాయేన మనసా భూయాంశ్ శ్రమ శ్శోకో బలక్షయః।
నైరాశ్యం మానహానిశ్చ గదోద్వేగో మహాభయమ్।
దురదృష్టం బీజదోషః సత్వస్యాభావ ఏవచ।
అపదార్థగదస్యైతే హేతవః కథితాబుధైః॥

## —♦ తస్యలక్షణమ్ ♦—

శ్లో. అద్భుతస్య గదస్యాస్య లక్షణా న్యద్భుతానిచ।
కోఽప్యేవం మన్యతే నూన ముదరం భుజగోఽవిశత్।
కోష్ఠే భ్రమత్యసౌ నిత్యంభుక్తే యద్భుజ్యతేమయా।
నిర్యాస్యతి కథా కేన కేనోపాయేన వక్ష్యతి।
కింవిధాస్యతి నాజానే దన్యే వాహం దురాత్మనా
కోఽపివా మనుతే భేకో మమమూర్ధ్ని సంస్థితః।
విఘట్టయతి మస్తిష్కం మారయిష్యతి మాం ధ్రువమ్।
కోఽపీక్షం చిన్తయేచ్చిత్రిం కాయః కాచ మయో మమ।
సఙ్ఘాతోఽయమహో రక్ష్య స్సదా ఘాతాత్ ప్రయత్నతః।
ఇత్యేవం బహురూపాణి గ్యార్ధచిన్తాణి తాకాలః।

అపదార్థ గదీశఙ్క్యేత్ సదా భీత స్సదా స్సుఖీ।
బహుధా బోధితో ఽప్యేష సాన్త్వితో ఽపి పునః పునః।
చిత్తాద్ భ్రమ మపాకర్తుం నశక్నోతి నసాధ్వసమ్।
యశ్చాస్య కథయేత్ భ్రాన్తిం తస్మై ద్రుహ్యతి నిత్యశః।
క్రియతే చ గదోద్వేగీ వ్యాధే సత్యత్వవాదిని।
గదోద్వేగవతా కోష్ఠే కస్మింశ్చి దనుభూయతే।
సుతీవ్రా వేదనా ప్రాయః పాకకోష్ఠే విశేషతః।
జిహ్వాస్యాత్ కఫలిప్తాస్య పూతిశ్వాసో నిరేతిచ
ఉత్క్లేశశ్చ తథావాన్తి రిత్థఞ్చ జీర్ణలక్షణమ్।
ప్రాఖర్యం స్పర్శశక్తేశ్చ పాండుత్వ ముదరామయః।
హృది సాం ఘాతికో వ్యాధిం కేన వాప్యనుభూయతే।
గదోద్వేగవతా న్యేన పురుషత్వస్య సంక్షయః।
జ్వర స్సతతకోఽన్యేన దుష్ప్రీతీ కార్యపవచ।
కిమాశ్చర్యం వేపనాద్యం జాయతేచ తదా తదా।
ఇత్థం బహువిధాకారా వ్యాధయః కల్పనాకృతాః।
భ్రమరూపాః ప్రజాయన్తే నిస్సత్వా నామమేధసామ్।
శక్యన్తే వ్యాధయో వక్తుం నైతే నిరవశేషతః।
లక్ష్యన్తే బుద్ధిమద్భిశ్చ యథాస్వం దోషలక్షణమ్।
ప్రాయశ ష్షోడశాదర్వాక్ నచ పఞ్చశతః పరమ్।
వ్యాధిరేష ప్రవృత్యేత క్షేణాత్మా స్త్రత్రి మనోగతిః।

మాసిమాసి రజఃస్రావాత్ సర్వే శుధ్యంతి ధాతవః।
అతస్సాన్నియుగదః స్త్రీణా మేష ప్రాయో నజాయతే॥

తా. వ్యాధిలేకుండగనే వ్యాధికలిగినదని శంకించుటయే గదోద్వేగ మని చెప్పబడును. అనగా దోషములేకయే దోషమున్నదని ఆరోపించుకొనుటయే అపదార్థగదమని వచింపబడును. శరీరమునకు, మనస్సునకు యొక్కడు శ్రమ, చింత, బలక్షయము, నిరాశ, మానహాని, మహాభయము, దారిద్ర్యము, బీజదోషము, బలహీనము, యివి అపదార్థగదమునకు హేతువులు.

ఈఅపదార్థగదమను వ్యాధిగలరోగి యొకానొకడు తన వుదరమున సర్పము ప్రవేశించి కోష్ఠమునందు సంచరించుచు తాను భుజించిన ఆహారము ను తినివేయుచున్నదని యనుమానించి తన్నే మిచేయునోయని భయమును జెందును. ఈసర్పము బైటికివచ్చు మార్గమెద్ది? ఏరీతిని నశించును? అనియోచించుచుండును. మరియొకడు తన శిరస్సునందు కప్ప ప్రవేశించియున్న దనిన్నీ తన పుర్రెను పగలగొట్టుచున్నదనిన్నీ, తన్నుతప్పక చంపుననియు భయపడును. యింకొకడు తన శరీరము గాజుమాదిరి యల్పమని భయపడి ప్రయత్నపూర్వకముగా రక్షించుకోవలయునని యోచించును. ఈవిధముగా అనేకఅనుమానములచే శుష్కించి భయాక్రాంతులై యుందురు. ఇతరు లనేకరీతుల జబ్బులేదని బోధించినను చిత్తవిభ్రాంతిని పోగొట్టుకొనజాలరు. ఎవరైనను తనకు రోగములేదనిన్నీ, రోగ మున్నదనుట కేవలము అనుమాన మేయనియు చెప్పినవారియెడల ద్వేషభావమును పూనియుండును. ఎవడు యీరోగికి వ్యాధియున్నదని చెప్పునో వాడు హితుడుగా కన్పట్టును. గదోద్వేగమను యీవ్యాధిగలరోగి ఆమాశయమందు తీవ్రమైనవేదన, పక్వాశయ మందు వేదన, శ్లేష్మముచే జిహ్వపూయబడి నట్లుండుట, ఉచ్ఛ్వాసనిశ్వాస ...లు దుర్గంధయుక్తముగా నుండుట, త్రేనుపులు వచ్చుట, వాంతి, స్పర్శ జ్ఞానము తగ్గియుండుట, పాండురోగము, ఉదరవ్యాధి, కలిగియుండును,

ఒకానొకనాఁగి తానజేకరోగములననుభవించుచున్న ట్లూహించును. యింకొ కడు పురుషత్వము నశించినదనియు యెంచును. ము యొక డు తత నాద్యాం ములు, ప్రతిక్రియలేనివై ఆశ్చర్యముగా బాధించుచున్నవని తలచును. ఈ ప్రకారము అనేకములైన వ్యాధులను కల్పించుకొందురు. బుద్ధి, సత్వములేని వారల కిట్టిభ్రమరూప వ్యాధులు జనించును. ఈవ్యాధులు నిశ్శేషముగా హరించుటకు శక్యముకాదు. బుద్ధిమంతులగు వైద్యులు రోగికిగల దోషలక్షణ ముల తెలిసికోవలయును. పదునారు సంవత్సరములలోపు వయస్సునను, ఏబది సంవత్సరములు దాటినపిమ్మట యీవ్యాధి జనించును. ఈవ్యాధి జనించు టకు మనోవ్యాపారమే ముఖ్యకారణము. ప్రతిమాసమునందును రజస్సు స్ర వించుటచే సమస్త ధాతువులు శుద్ధిపొంది స్త్రీలకు యీస్వాయు గదము జనించదు.

## —♦ శుక్రమేహనిదానమ్. ♦—

శ్లో. యోఽనాత్మవానవిధినా కురుతే రేతసోవ్యయమ్।
శుక్రమేహాభిధ స్తస్య గదో భవతి దారుణః।
మలమూత్రాతివేగేన తథాకామస్య వేగతః।
స్త్రీస్వప్నేష్టిదృష్టి స్మరణా దపి రేతః పతే త్తథా।
నిద్రాయాం రమణీ సంగానుభవాత్ సంపతే దపి
రోగేఽతి ప్రబలే శిశ్నే శిథిలేఽపిచ తత్పతేత్।
తన్ద్రావేశే ధశయనే తత్పతే రతపవచ।
నశక్నుయా ద్గదీ నారీం సంతోషయితు మణ్వపి॥
తతో యాయాద్ భాగ్యహీనో ధ్వజభఙ్గాఖ్య మామయమ్।
వృథా జీవతి సక్లీబో మరణం తస్య జీవనమ్।

అగ్నిమాన్ద్యం కోష్ఠరోధః శిరసః పరిఘూర్ణనమ్।
అజీర్ణ మతిసారశ్చ దృష్టే ర్దుర్బలతా తథా।
నేత్రాన్తే నీలిమా శుక్రమేహస్యోపద్రవా ఇమే॥

తా. అతిసంగమము చేగాని, మిక్కిలిమైథునము చేగాని, శుక్లమును పో గొట్టుకొనుటచే శుక్రమేహమను దారుణవ్యాధి జనించును.

మలమూత్రాదివేగములవలనను, కామోద్రేకములవలనగాని, స్త్రీలను తాకుట, చూచుట, స్మరించుటవలనగాని శుక్రముపడిపోవును. నిద్రలో స్త్రీ సాంగత్యముచేసినటుల కలవచ్చి రేతస్సుపడిపోవును. రోగము ముదిరిన పిమ్మట శిశ్నపటుత్వము తగ్గినను శుక్రము నష్టమగును. కునికిపాటు, ఉద్వే గము, శయనము, వీనియందు శుక్రముపడును. ఈరోగికి శీఘ్రస్ఖలనము సంభ వించుటచే స్త్రీలను సంతోషపెట్టజాలడు. ధ్వజభంగము, కలిగియుండును. వ్యర్థజీవి యగును. నపుంసకుడై మృతిజెందును. అగ్నిమాంద్యము, మలబద్ధము, తలతిప్పు, అజీర్ణము, అతిసారము, దృష్టిమాంద్యము, నేత్రాంతములయందు నలుపు యివిశుక్రమేహ రోగికలుగు వుపద్రవములు.

## —♦ యోనికన్దానిదానమ్. ♦—

శ్లో. యోనౌ బలానే సంక్లిద్ధే జరాయువికృతే స్తథా।
వస్తిద్వారేఽర్బుదే జాతే దుర్నామగదితోఽపిచ।
యోనే స్సిరాణాం పరిస్రుతే ర్వాతవత్యాశ్చ యోషితః।
రజఃప్రవృత్తిసమయే పురుషేణాతిసంగమాత్।
గర్భపాత్రే గుద్భవేచాపి యోనౌ కన్దాః ప్రజాయతే।
వార్ధక్యేపి నారీణాం స్వాభావేషేణ సంభవేత్।

యోనౌ కణ్డూశ్చతోదశ్చ శ్వాక్ష్యం శుష్కత్వమేవచ।
యోనికణ్డూగదస్యైత ల్లక్షణం భిషజో విదుః॥
ఉష్ణానుపశయో వ్యాధి శ్శీతో పశయ ఏవహి॥

తా. యోనియందు కఫము వృద్ధిజెందినను, మావివికృతిస్థితిని పొంది నను, మూలశంకరోగమున్నను, వస్తిద్వారమందు అర్బుదము (కంతి) జనించినను, వాతత్వముగల స్త్రీకి యోనియందలి సిరలు స్రవించినను ఋతుసమయమందు అతిసంగమము చేసినను గర్భోత్పత్తికి పూర్వమందును యోనికండువు (దురద) జనించును. ఈవ్యాధి తరుచుగా వార్ధక్యమునందే జనించును. యోనికణ్డూవ్యాధియందు యోనిలో దురద, పోటు, గరగరలాడుట, యెండినట్లుండుట యీలక్షణములుండును. ఈవ్యాధి వుష్ణముచే వృద్ధినొందుటయు, శీతలముచే శమించుటయు కలదు.

## —• యోన్యంకురవృద్ధినిదానమ్. •—

శ్లో. దుష్టవాతేన రక్తస్య దోషాచ్చ కరకర్మణా।
యోన్యంకురస్య సంవృద్ధి ర్జాయతే పరమోత్కటా।

తా. కఫాదులచే దూషితమైన వాతముచేతను, రక్తదోషమువలనను ముష్టిమైథునము వలనను, మిక్కిలి పీడాకరమైన యోన్యంకుర వృద్ధియను వ్యాధి జనించును.

## • యోన్యాక్షేపనిదానమ్. •

శ్లో. మారుతే విగుణే యోనౌ స్పర్శస్యాతి ప్రవృద్ధతే।
విక్షేపణం ముఖస్యాస్యా స్తత్ స్పర్శే తీవ్రవేదనా।
యోన్యాక్షేప వతీ నారీ న సహేత రతిక్రియామ్।

యదిగచ్ఛేత్ బలాద్భర్తా రుగ్ణాతి వ్యథితా భవేత్।
నోపసర్పతి భర్తారం తస్మాద్ రుగ్ణేతి విహ్వలా।
సత్యా తిరస్కృతా దుఃఖా న్మృత్యుమాత్మన ఇచ్ఛతి।
ఉద్వేగో వహ్ని హానిశ్చ నిద్రాల్పత్వం తథా భ్రమాత్।
వస్తి దాహో వ్యథాపృష్ఠే శ్వేత శ్చోత్క్రమణేఽపిచ।
వర్ణ హానిశ్చ దౌర్బల్యం తథోత్సాహస్య సంక్షయః।
యోన్యాక్షేపగదస్త్వేతాః ప్రోక్తా ఆకృతయో బుధైః॥

తా. యోన్యాక్షేపకరోగమందు యోనియందు వాతము వృద్ధిజెంది అతిస్పర్శనుగోరుచు, యోనివిడబారి స్పర్శమాత్రముననే తీవ్రమైన వేదన కలిగి రతిక్రియను సహింపలేనిదై యుండును. బలాత్కారముగా భర్తరమిం చినయెడల మిక్కిలి బాధపడును. భర్తయనిన యెల్లప్పుడును భయమును కల్గి సమీపింపదు. భర్తచే తిరస్కరింపబడినయెడల దుఃఖమువలన తనకు మరణ మును కోరుకొనును. ఈవ్యాధియందు తొందర, అగ్నిమాంద్యము, స్వల్ప నిద్ర, వస్తియందుమంట, పృష్టభాగమున పీడ, కదలుటకు శక్తి, దౌర్బల్య ము, వివర్ణము, నిరుత్సాహము యీలక్షణము లుండును.

## —♦ అండాధారగదనిదానమ్. ♦—

శ్లో. రమణాతిశయాచ్ఛైత్యా దభిఘాతాద్విపాదపి।
అణ్డాధారగదఃకృచ్ఛ్రోజాయతే చాహితాశనాత్।
ఉదరోరువ్యథా కృచ్ఛ్రమూత్రస్యాల్పత్వరక్తతే।
జ్వరోరాగోనకహృల్లాసా అరతి ర్మలసంక్షయః।

ధమనీవేగినీ తృష్ణా దాజిహ్వా రక్తోజ్జ్వలాతధా।
అణ్డాధారగదస్యైతాః ప్రోక్తా ఆకృతయో బుధైః॥

తా. అతి మైథునము, శీతలోపచారము, పడుట, విషప్రయోగము, అయిష్టపదార్థసేవన యీ కారణములవలన అండాధారగదము జనించును. ఈవ్యాధియందు కుక్షిశూల, కష్టముమీద కొద్దియెరుపుతో కూడినమూత్రము వెడలుట, జ్వరము, అమం, వోకిరింత, మనస్థిమితము లేకుండుట, బలమునశిం చుట, నాడి చురుకుగాను మందముగాను చలించుట, నాలుక యెర్రబారి యుండుట యీలక్షణములు కలిగియుండును.

—♦ అంశుఘాతనిదానమ్ ♦—

శ్లో. చణ్డాంశోరంశునాశీర్షి తప్తే చణ్డేనజాయతే।
అంశుఘాతాభిధోవ్యాధిః ప్రాణినాం ప్రాణపీడకః।
తృష్ణాతిఘోరాత్వగ్రూక్షా భ్రమోనేత్రస్యరక్తతా।
మూత్రవేగశ్చమూర్ఛాయోహృల్లాసోవిమమాధరా।
శ్వాసకృచ్ఛ్రం స్పర్శహానిరాక్షేపశ్చాత్ర సమ్భవేత్।
ప్రాయఃకారావరుద్ధానాం భటానాం జాయతేచనః।
నీలిమాహస్త పాదస్యధమన్యాః క్షీణలుప్తతా।
విక్షేపణఞ్చగాత్రాణాం మరణాయాంశుఘాతినః॥

తా. తీక్ష్ణమైన సూర్యకిరణములచేత శిరస్సు తపింపబడినయెడల తీవ్ర మైనవేదన కలుగును. ప్రాణములను పీడించు యీవ్యాధి అంశుఘాతమని చెప్పబడును. దీనియందు మిక్కిలి ఘోరమైనదాహము, చర్మము గరగరలాా

దుటు, కండ్లు తిరుగుట, చెట్టుబారియుండుట, మూత్రవేగము, మూర్ఛ, వోకిరింత, నాడివిషమగతిని జెందుట, శ్వాసకష్టముగా ఆడుట, స్పర్శజ్ఞానము తగ్గియుండుట, ఆక్షేపకవాతము సంభవించును. తరుచుగా చెరసాలయం దుంచబడిన భటుల కీవ్యాధికలుగును. హస్తపాదములయందు నలుపు, నాడి క్షణకాలము లోపించుట, శరీరము కంపించుట, యీలక్షణములు అంశుఘాత రోగికి సంభవించి తుదకు మరణము కలుగును.

## —◆ మస్తిష్కచయాపచయనిదానమ్. ◆—

శ్లో. దేహస్వభావాద్విష్ట్యాచ వర్ధతే మస్తులుఙ్గకః।
కరోటీరపి బాలానాం యూనాఞ్చాపి కదాచన।
మస్తిష్కస్యకరోటేశ్చయదివృద్ధిర్ద్వయోర్భవేత్।
నచిహ్నం దృశ్యతే కిఞ్చిత్ ప్రాయశస్సమవర్ధనాత్।
మస్తిష్కస్యాపచేద్వృద్ధిర్నకరోటేస్తథాభవేత్।
తదానిపీడనాత్తస్యజాయన్తే వివిధా రుజః।
శిరసోఽతిరుజాతీవ్రాదౌర్బల్యం భ్రమమూర్ఛనే।
పక్షాఘాతస్తథాక్షేపస్తతో మరణమేవచ।
హ్రాసమాయాతి మస్తిష్కం నేహాదోషాదదృష్టతః।
ఏకపార్శ్వేహ్రసేత్ తచ్చేన్న శీఘ్రం జీవనక్షయః।
సమన్తాద్ధ్రసనాత్ తస్యప్రాణాన్స్యైరయాభవేత్॥

తా. దేహస్వభావము (ప్రకృతి) వల్లను, దైవవశముచేతను బాలురకు యౌవనవంతులకు నొకానొకప్పుడు మెదడు, తలపుర్రెయు వృద్ధిపొందును.

మెదడును, తలపుర్రెయును వొక్కొకప్పుడు సమానముగా వృద్ధినొందుటచే వృద్ధి యొక్క చిహ్నములంతరముగా తెలియబడవు. కాని మెదడు, తలపుర్రె వీనిలో ఒకదానివృద్ధివలన రెండవదానియొక్క పీడచే అనేకబాధలు కలుగును. శిరస్సునందు తీవ్రమైనపోటు, దౌర్బల్యము, కండ్లుతిరుగుట, మూర్ఛ, పక్షాఘాతము, ఆక్షేపకవాతము, మరణము కలుగును. దేహదోషములవలన అదృష్టము వలన మెదడు ఒకపార్శ్వమునందు క్షీణమునొందిన రోగి శీఘ్రముగా మరణించును. ఒకొకసారి మెదడు, పుర్రె రెండును క్షీణించుటవలన శీఘ్రముగా మరణించును.

## —◆ ఉరస్తోయనిదానమ్. ◆—

సంప్రాప్తి:—

శ్లో. ఉరస్యేకతరే పార్శ్వే పార్శ్వయోర్వాప్యపాంచయః।
ఉరస్తోయగదస్స్యాత్తు ప్రాయశః ప్రాణనాశనః।

రూపమ్:—

కృచ్ఛ్రాచ్ఛ్వాసః కఫస్రావో నీలావోష్ఠౌ తథాముఖమ్।
శోథఃపాదేధరా తుదార్తివిషమా వేగవాహినీ।
మూత్రాల్పత్వం భవేచ్చాపి నరోగీ శయనక్షమః।
స్వాస్థ్యం కిఞ్చిత్ సమాసీనో లభతేఽస్మిన్ మహాగదే॥

తా. వక్షస్స్థలమునందొక పార్శ్వమునందుగాని, రెండుపార్శ్వములందుగాని ఉదకముచేరి ప్రాణహానినిచేయు ఉరస్తోయమనువ్యాధి జనించును. దీనియందు శ్వాసకష్టముగా వెడలుట, కఫస్రావము, పెదవులు ముఖము నల్లబడుట, పాదములయందు వాపు, నాడివిషమముగాను, వేగముగాచలించుట, మూత్రము స్వల్పముగా వెడలుట, పరుండుటకు కుదురులేకుండుట, కూర్చుండినప్పుడు రోగికిసుఖము కలిగియుండి తుదను మరణించును.

—◆ అతత్త్వాభినివేశనిదానమ్. ◆—

శ్లో. మలినాహారశీలస్య వేగాన్ప్రాప్తాన్నిగృహ్ణతః।
శీతోష్ణస్నిగ్ధరూక్షాద్యైర్హేతుభిశ్చాతిసేవితైః॥
హృదయం సముపాశ్రిత్య మనోబుద్ధివహాస్సిరాః।
దోషాస్సందూష్యతిష్ఠన్తి రజోమోహావృతాత్మనః॥
రజస్తమోభ్యాం వృద్ధాభ్యాం బుద్ధౌ మనసిచావృతే।
హృదయే వ్యాకులే దోషైరథమూఢోఽల్పచేతనః॥
కరోతి విషమాం బుద్ధిం నిత్యానిత్యే హితాహితే।
అతత్త్వాభినివేశం తమాహురాప్తా మహాగదమ్॥

తా. మలినముతో కూడిన ఆహారసేవన, మలమూత్రాదివేగముల నిరోధించుట, మిక్కిలి చల్లనైనట్టియు, మిక్కిలివేడియైనట్టియు, మిక్కిలి జిడ్డుగలట్టియు, మిక్కిలి ఆరిపోయినట్టియు, ఆహారసేవనలచేతను మనోబుద్ధులను వహించుసిరలను హృదయమున వాతాదిదోషములు దూషింపజేసి రజోమోహాత్మకమైన మనుజునకు రజస్తమస్సులయొక్క అావరణచే హృదయమందు వ్యాకులముకలుగును. మూఢుడైనట్టియు, స్వల్పమైన చైతన్యము గలట్టియు ఆమనుజుడు నిత్యానిత్యవస్తువులయందు హితాహిత వస్తువులయందు విషమబుద్ధిని కలిగియుండును. దీనిని అతత్త్వాభినివేశమును మహాగదమని వచింతురు.

—◆ ఔపసర్గికవిసూచిక. ◆—

సామాన్యరూపమ్:—

శ్లో. తణ్డులోషితతోయాభే అతిసారవమీ ఉభే।
బహువేగాత్ ప్రవర్తేతే సావిసూచ్యుపసర్గజా॥

హేతుః:—

శ్లో. నిదానమ్ జలసంయుక్తజన్తవో జఠరే గతాః।
సాంక్రామికవిసూచ్యాస్తు సత్యజీర్ణే హి తేమతాః।
అసత్యజీర్ణే జీవాణు సమూహేఽపిస్థితేసతి।
నోత్పత్త్యతివిసూచీయం హృద్దౌర్బల్యేఽభవాఽసతి॥

రూపమ్:—

శ్లో. క్వచిత్స్యాదతిసారోహి క్వచిద్వా కేవలావమిః।
అతిసాంక్రామికే వ్యాధౌ మరణం వా ముహూర్తతః।
తథా విధేఽస్మిన్ సంజాతే రోగే బహుభయంకరే।
రోగాక్రాన్తాశ్చ భీతాశ్చ మ్రియన్తేహి సహస్రశః।
విసూచ్యాశ్చాపి రూపాణి పూర్వోక్తా న్యఖిలాన్యపి।
సాధ్యాసాధ్యస్వరూపాణి జ్ఞేయాన్యత్ర విచక్షణైః॥

తా. ఓయ్యపుకడుగు నీటివలె విరేచనములు, వాంతులునగుట, మిక్కిలి వేగముగా పుట్టినట్టి దీనిని ఔపసర్గికవిసూచిక యందురు.

జలపానమందు క్రిములు కుక్షియందు ప్రవేశించి అజీర్ణమును కలిగించి ఔపసర్గికవిసూచిని పుట్టించును. అజీర్ణములేక క్రిములుండినను విసూచిజనించదు. కాని హృదయదౌర్బల్యమువలన విసూచి జనించును.

ఒకప్పుడు అతిసారవిరేచనములు, ఒకప్పుడు వాంతులు కలుగును. ఉద్రేకముగా సంభవించు యీవ్యాధివలన క్షణకాలములో రోగి మృతిజెందును. ఇట్టిభయంకరమైన రోగము కలిగినపుడు యీరోగస్థులును భయ

పడిసహామును, నీలరోగలక్షణములు మొదలగునవి. యీప్రాణోక్త లక్షణము లన్నియు నీమూత్రరోగమందున కలిగియుండును. ఈరోగమందు వైద్యవేత్తలచే సాధ్యాసాధ్య లక్షణములు గుర్తింపబడవలెను.

## ఔపసర్గిక మేహ నిదానమ్

శ్లో. బహుసఙ్కర సమ్భోగ ప్రక్లిన్నేన్ద్రియయా పుమాన్।
స్త్రియా సఙ్గమ్య సమ్యఙ్మూఢో గదమాప్నోతి దారుణమ్।
మూత్రనాడ్యన్తరస్థానాత్పూయస్య శ్లేష్మవాహినీ।
ప్రణితాఽవాహరేత్ క్లేదంవ్రణమేహాస్స ఉచ్యతే।
ఔపసర్గిక మేహశ్చతస్య నామాన్తరం మతమ్।
మేహ ఆగంతుకశ్చాపిసక్తైశ్చిత్ పరిభాష్యతే।
ఆరభ్యసఙ్గమ నిశాం సంఖ్యయాయాచసప్తమీ।
ఏతద్ వ్యవహితే కాలే ప్రాయశో జాయతేగదః।
కణ్డూః శిశ్నాగ్రతస్తస్య సముత్థానం ముహుర్ముహుః।
తీవ్రవేదనయాచాపి ముహుర్మూత్ర ప్రవర్తనం।
స్ఫీతిర్లిఙ్గస్య లౌహిత్యం కోషేబ్రధ్నేచ వేదనా।
కదాచిత్ క్లేదసంరుద్ధమార్గత్వాదతిరుగ్స్రవేత్।
మూత్రం దాహేన ఘోరేణద్విధారం వాప్రవర్తతే।
క్షరేద్వా క్షతజం మేఢ్రాన్మూత్రకాలే కదాచన।
సన్తతం తనురాస్రావః స్రవేదాదాతతోఽతనుః।
నతావత్ పునరా శుష్యన్ పీతాభాసః ప్రయాతిచ।

కాలోలక్ష్మీస్యధాం కర్యాద్ వ్యాధిశ్చదుప్ప్రతిక్రియమ్।
ఆమవాతాక్షిరోగాద్యా జ్ఞేయాశ్చాస్యహ్యుపద్రవాః॥

తా. అనేకమంది పురుషులతో సంగమము చేయు స్త్రీతో కలయుట వలన పురుషునకు దారుణమైన ఔపసర్గిక మేహమును వ్యాధి జనించును. దీని యందు మూత్రనాడి మధ్యయందుండు శ్లేష్మవాహినియందు పుండుకలిగి దహించును. కావున నియ్యది వ్రణమేహమని కూడ పచింపబడును. దీనినే కొందరు ఆగంతుక మేహమని చెప్పెదరు. ఈ వ్రణమేహము సంగమముచేసిన దినము మొదలు ఏడురోజులలోపున గాని తరువాత గాని జనించును. శిశ్నాగ్రమందు మాటిమాటికి దురద, అంగమందు తీవ్రమైన పోటు, మాటిమాటికి మూత్రము స్రవించుట, లింగము బద్ధలగుట, యెరుపు కోష్ఠమునందును వస్తియందును వేదన, ఒకానొకప్పుడు స్రావము అడ్డుకొనబడుటవలన మిక్కిలి పోటుతో స్రవించుట, ఘోరమైనమంటతో మూత్రము రెండు ధారలుగా వెడలుట, మేఢ్రమునుండి మూత్రమువిడుచునపుడు వొకానొకప్పుడు వ్రణమునుండి స్రావముకలుగును. ఎల్లప్పుడును కొద్దిగా స్రవించుటయు, మధ్యమధ్య యెక్కుడుగా స్రవించుట కలుగును. ఆస్రావము అరినదై కొంతకాలమునకు పచ్చనిదిగ మారును. కొద్దికాలము బాధించి చికిత్సింపశక్యముకాని ఆమవాతము, అక్షిరోగము మొదలైన వుపద్రవములను కలుగజేయును.

## —♦ వృక్కామయనిదానమ్. ♦—

శ్లో. త్వగ్రూక్షోష్ణవేగవతీ ధమనీ కఠినాతథా।
నిద్రానాశోవహ్నిమాన్ద్యం శోథోఽక్షిచముఖేపదే।
వృక్కామయస్యపూర్వాణిరూపాణ్యాహుర్భిషగ్వరాః।
రక్తాల్పత్వాన్ముఖస్యస్యాత్ పాణ్డుత్వం కటివేదనా।
త్వక్శుష్కాస్వేదహీనాచ ధమనీ దుత్రతగామినీ।

వహ్ని మాన్ద్య మరుచిశ్చ భక్తద్వేషో వ్యథోదరే।
అమ్లోద్గారస్తథాచ్ఛర్ది హృద్వేషః శ్వాస కృచ్ఛ్రతా।
మూత్రాల్పత్వం సదా వేగో విశేషా న్నిశిజాయతే।
మూత్రకాలేచ శిశ్నాగ్రే మనాగ్ దాహోఽనుభూయతే।
వృక్కయోర్వికృతి శ్చాస్మిన్ విశేషాజ్జాయతే గదే।
యకృత్ ప్లీహాహృదా శ్చాపి నాసన్నై వపరిజాయతే।
కర్ణనాదోఽక్షిదోషశ్చ శిరోగ్రీవాంస వేదనా।
శాఖా సుగౌరవం మూర్ఛా వృక్కరోగస్య లక్షణమ్।
రక్తస్య పరిపృత్యాపి జాయతే వృక్కవైకృతమ్॥

తా. చర్మమందు గరగర, వేడి, నాడియందు వేగము, కడుపుబ్బు, సుపరితేకపొక్కుట, అజీర్ణము, నోళ్లు, ముఖము, పాదములు వీనియందు వాపు, వృక్కములయొక్క వ్యాధిగములందు ఒనరును. పెరుసంతి రక్తక్షీణము, ముఖము తెల్లబారుట, కటిప్రదేశమునపోటు, చర్మము యెండినట్లుండుట, చెమటపట్టకుండుట, నాడివేగముగా నడచుట, అన్నము జీర్ణము కాకుండుట, అన్నద్వేషము, ఉదరమందు పీడ, పుల్లని త్రేనుపులు, వాంతి, గుండెదడ, శ్వాస కష్టముగానడచుట, మూత్రము కొద్దిగను, తరుచుగను రాత్రియందు విశేషముగను వడచుట, మూత్రము విడుచుకాలమున శిశ్నాగ్రభాగమున కొంచెము మంటకలుగును. [illegible]వ్యాధియందు మూత్రపిండములు వికృతి చెంది యకృత్, ప్లీహ, హృదయములయందును మార్పుకలుగును. కర్ణనాదము, దృష్టిమాంద్యము, శిరస్సు, మెడ, భుజశిరస్సులు, వీనియందుపోటు, హస్తములు, పాదములు బరువెక్కుట, మూర్ఛ, యీవృక్కముయొక్క వ్యాధికి లక్షణములు. మూత్రపిండములందు రక్తముయొక్క పరిణామముచే వికృతి కలుగును.

## మస్తిష్కవేపననిదానమ్.

శ్లో. శిరస్యభిహతే తైస్తైర్మూర్ఛా హృల్లాసవాన్తయః।
జడత్వం స్పన్దనం హ్రాసో దౌర్బల్యం చలచిత్తతా।
వేపథుః కర్ణనాదశ్చ మలినత్వం ముఖస్యచ।
పృథుత్వం తారకాయాశ్చ ధమనీ బలవర్జితా।
శీతలత్వం శరీరస్య వైకృత్యం వచనస్యచ।
తథాపక్షవధం స్యాచ్ఛిరోదేశ్మిన్ శీర్ష వేపనే॥

తా. శిరస్సునందు దెబ్బతగులుటచే మూర్ఛ, గుండెబరువు, వాంతి, జడత్వము, శరీరమదరుట, కృంగుట, దౌర్బల్యము, చిత్తచాంచల్యము, కంపము, చెవిహోరు, ముఖమాలిన్యము, కనుపాపపెద్దదగుట, నాడియందు బలహీనము, శరీరము చల్లగనుండుట, మాట్లాడుటకు శక్తిలేకుండుట, పక్షాఘాతము యీలక్షణములు మస్తిష్కవేపనమను వ్యాధియందు కలుగును.

## కాలజ్వరనిదానమ్.

నిదానమ్:—

శ్లో. ప్రాయ అనూపదేశే షుభూబాష్ప క్రిమికారణైః।
కాలజ్వరః ప్రజాయేత తల్లిఙ్గ మిహ వర్ణ్యతే॥

లక్షణమ్:—

శ్లో. ప్లీహాగ్ని సాదనైషమ్యాత్ సతతజ్వరలిఙ్గకః।
జీర్ణస్యా చ్ఛుష్కమాంసాదిః పాణ్డుతాచ నఖాదనే।

ములయందు జనించి శ్లేష్మవాత ప్రధానమై యుండును. ఇది బాలురకును, యౌవనవంతులకును విశేషముగా సంభవించును.

## —♦ శ్వసనకజ్వర నిదానమ్. ♦—

సామాన్యరూపమ్:—

శ్లో. లాక్షారసాభంయః ష్ఠీవేద్ రక్తం శ్వాసజ్వరార్దితః।
స్థాన ఫుప్ఫుసమూలస్య తస్యశ్వసనకో జ్వరః॥

నిదానమ్:—

శ్లో. సమాచ్ఛాదనహీనానాం దుర్బలానాం విశేషతః।
దీనానాం దూనచిత్తానాం శీతవర్షాదిబాధనాత్
అభిఘాతాత్ క్వచిత్ పూతిగన్ధయోగేన కుత్రచిత్।
క్వచిద్వా వ్యాధినాఽనేన పీడితస్యాఽతి సఙ్గమాత్।
సర్వేష్వే వర్తుష్వపాయో వర్షాసు శిశిరే మధౌ।
విశేషేణప్రజాయేత జ్వరో జీవాణుసమ్భవః।

సంప్రాప్తిః—

శ్లో. సంహత్యా సృజ్మూలతః ఫుప్ఫుస స్యాఽనల్యే
పార్శ్వే సవ్యతోఽవా ద్వయోర్వా।
హన్యుర్దోషాః శ్వాసయన్తిం విషోద్ధాః కృద్ధాస్తస్మాచ్ఛ్వాసన
కష్టంజ్వరశ్చ॥

పూర్వరూపమ్:—

శ్లో॥ పార్శ్వార్తిః శ్వాసకాసౌచ క్వచిత్ కమ్పోఽవసన్నతా
జ్వరే శ్వసనకే ప్రాయః పూర్వరూపమిదంమతమ్॥

రూపమ్:—

శ్లో. ప్రాయఃప్రాక్ శీతమత్యర్థం జ్వరస్త్రీవ్రోఽరుచిస్తృషా।
పార్శ్వశూల మథోకాసః శ్వాసవృద్ధిః క్రమేణచ।
కాసతః శోణితం శ్యామం ముహుస్స్యాన్ద్రం ప్రవర్తతే।
శ్వసతో నాసికా పార్శ్వే స్ఫూర్జతశ్చనిరన్తరమ్।
స్వేదో లలాటే గాత్రేషు భృశం స్విద్యన్తి చానిశమ్।
గౌరసర్షపవత్ స్వేద పిడకానాఞ్చ దర్శనమ్।
దౌర్బల్యం సదనం మోహః ప్రలాపః కణ్ఠకూజనమ్।
పరుషా కర్కశా జిహ్వా మలినాచ భవేద్భృశమ్।
ధమనీ యుగ్మతా మేతి కోమలా స్థూల చంచలా।
యావన్న జ్వరముక్తిః స్యాత్ జ్వరముక్తే రనన్తరమ్
విశేషాత్ మందతామేతి రోగేస్మిన్నితినిశ్చయః।
సప్తమే దివసే ప్రాయ శ్చాష్టమే నవమేఽథవా
అకస్మాద్ జ్వరనిర్ముక్తిః స్వేద ప్రాచుర్య మేవచ।
ప్రాణావాతత్రముచ్యన్తే రోగింవా తత్రముచ్యతే।
మూర్ఛా మానస్తు నైరుజ్యం శీఘ్రమేవ సమశ్నుతే॥

సాధ్యాసాధ్యలక్షణమ్:—

శ్లో. ఏకతః ఫుప్ఫుసేదుష్టేజ్వరేఽతీవేప్సితే బలేసమ్యక్।
పాతత్రయేలబ్ధే మన్తవ్యా సుఖసాధ్యతా॥

నుగాని శ్వాసయంత్రమును పాడుజేసి ఆయాసము, జ్వరమును కలుగ జేయును.

పార్శ్వపునొప్పి, ఆయాసము, దగ్గు, ఒకప్పుడు కంపము, కృశించుట, యీజ్వరమునకు పూర్వరూపములు.

తొలుత తరుచుగ యెక్కువచలి, తీవ్రమైనజ్వరము, అరుచి, దప్పి, పార్శ్వశూల, దగ్గు, ఆయాసము, దగ్గినపుడు నల్లనిరక్తము నాటినాటికి చిక్కగపడుట, శ్వాసనువిడుచునపుడు గుఱ్ఱుయొక్క పార్శ్వము లెగయుట, నుదుట చెమటబట్టుట, శరీరమంతయు యెల్లప్పుడును చెమటబట్టుట, తెల్లా వాలవంటి చెమట పొక్కులు బయలుదేరుట, దుర్బలత్వము, మూర్ఛ, ప్రలాపము, పిల్లికూతలు, నాలుక గరుకుగ, గట్టి, నల్లగనుండుట, నాడి ద్వంద్వ గతినిజెంది మెల్లగగాని, వేగముగగాని నడుచుచు స్థిరముగ నుండకపోవుట, యీలక్షణములు జ్వరమున్నంతవరకు నుండును. జ్వరము విడిచినపిమ్మట మాంద్యము ప్రవేశించును. ఏడు, ఎనిమిది లేక తొమ్మిది దినములయందు అకస్మాత్తుగ జ్వరము విడుచును. ఎక్కువగ చెమటపట్టును. ఆసమయమున రోగి మృతినొందుటగాని రోగవిముక్తి జెందుటగాని కలుగును. రోగము విడిచినవెంటనే బాధలన్నియు తగ్గును.

ఒక్క వూపిరితిత్తిమాత్రమే చెడి వ్యాధము పెంపునుబొందక, రోగి, వైద్యుడు ఔషధము అను పాదత్రయము బలవత్తరమైనపుడు యీజ్వరము సులభసాధ్యము.

మిక్కిలి చెమటబట్టి జ్వరము తీవ్రముగానుండెనేని వృద్ధుడుగాని, కృశించినవాడుగాని, మనోవైకల్యమును బొందినవాడుగాని, పాదత్రయ సంపత్తిగలిగినను వొకప్పుడును జీవించడు.

ఊపిరితిత్తులురెండును వాతాదిదోషయుక్తములై పూర్తిగ వికృతిని జెంది, యెక్కువఆయాసము, మిక్కిలిచెమట గలిగెనేని రోగి జీవింపడు.

మెల్లగ కొంచెము పేలుట, స్నానము చేసినటుల చెమట పట్టుట, మూర్ఛనొందుట, కాలుసేతులు వణకుట, కలిగినేని రోగి జీవింపడు.

అతిసారము, నెక్కిలి కృశత్వము, కలిగి ఘూశ్వాసనక జ్వరముచే బాధపడువాడు నిశ్చయముగ మృతినొందును.

## —♦ శ్లేష్మకజ్వర నిదానమ్. ♦—

శ్లో. ప్రాదుష్యన్తి హి యత్రాప్రాయః శ్లేష్మజోపద్రవా భృశమ్।
తతో జనపదో ధ్వంసీ జ్వరోఽసా శ్లేష్మకఃస్మృతః॥

నిదానమ్:—

వాయువాహిత జీవాణు విషం యుగపదఙ్గనా
లోకేషు ప్రసృతం ప్రాయః శ్వాస మార్గేణ తంజ్వరమ్।
విదధాతి క్వచిద్వాఽథ భుక్త మార్గేణ సంక్రమః।
జనాఙ్గనేచ సంక్రాన్తి శ్వసనాది నిమిత్తతః॥

సంప్రాప్తి:—

శ్లో. ప్రాయశ్చాస్య వికారాఃస్యుః శ్వాసయన్త్రే క్వచిత్పునః।
అన్నమార్గే సమగ్రేఽపి వ్యాపివా సర్వధాతుషు।
కఫవాఙ్కోల్బణం హ్యత్ర సన్నిపాతముదీరయన్।
విషంధాతూన్ వికురుతే హన్తి తేన సహస్రశః॥

రూపమ్:—

శ్లో. ప్రతిశ్యాయః శిరశ్శూలం శీతకమ్పాచకుత్రచిత్ అఙ్గమర్దః
కటీ పృష్ఠోరసాం తీవ్రాశ్చ వేదనాః।
కాసోజ్వరో వసాదశ్చ కార్శ్య ఞ్చాల్పెద్దినై ర్భృశమ్।

అత్యర్థబలహానిశ్చ లిఙ్గాని శ్లేష్మకేజ్వరే।
సామాన్యతో విశేషాత్తు ఘస్సుసాకోమణే సతి।
సరక్తం ష్ఠీవనం ప్రాయః ప్రలాపః శ్వసనస్తథా।
అథాన్నమార్గ ఆకాన్తైవమ్యతీసారయోర్ద్వయోః।
ఏకస్యవా ప్రవృత్తిః స్యాత్ శూలం క్వాపి చకామలా।
అత్యర్థ విషయోగేన సర్వధాతు ప్రదూషణమ్।
అభిన్యాససమం క్వాపి రూపం తస్మాన్న ముచ్యతే।
నైరుజ్యం స్వల్పదోషస్య శీఘ్రం యద్యపి జాయతే।
బలహానిశ్చిరాయైవ కృచ్ఛ్రాతుబహు దోషతా॥

తా. ఉపద్రవములు శీఘ్రముగ జనించి, నగరములను (జనసమూహములు) ధ్వంసము చేయునదియైయుండు యీజ్వరము శ్లేష్మక జ్వరమని చెప్పబడును.

గాలియందు సంచరించు విషక్రిములు శీఘ్రముగ శ్వాసమార్గమును బొందుటచేగాని లేక వొకప్పుడు ఆహారపానీయముల మూలముగ విషక్రిమ్ము శరీరమున ప్రవేశించుటచేతగాని జనుల కీజ్వరము కలుగుచున్నది. వొకరు విడిచినగాలిని మరొకరు పీల్చుట మొదలగుకారణములచే గూడ ఈజ్వరము సంక్రమించును.

ఈజ్వరమున ఊపిరితిత్తులయందు దోషము కలుగును. ఒకప్పుడన్న మార్గమంతయు దోషింపబడును. లేక రక్తాది సప్తధాతువులు దోషింపబడును. కఫవాత ప్రకోపముకలిగిన సన్నిపాత దోషముగామారును. ఈజ్వరముచే సప్తధాతువులు చెడి వేలకొలది జనులకు మృత్యువు సంభవించును.

పడిశము, తలపోటు, చలి, దప్పు, యీలక్షణము లొకప్పుడును, ఒడలునొప్పులు, కటిభాగమునందున, పృష్ఠభాగమునందున, గుండెభాగమునందున, తీవ్రమైన వేదన, యివి యొకప్పుడును కలుగును. దగ్గు, జ్వరము, శరీరముబరువు, కొద్దిరోజులలోనే శీఘ్రముగ కృశించుట, అతిదౌర్బల్యము కలుగును. శ్వాసకోశము కొద్దిగగాని, యెక్కువగగాని చెడియున్నట్లు వుమియునపుడు రక్తముకలసిపడుట, ప్రలాపము, శ్వాస కష్టముగా ఆడుట, యీలక్షణములుండును. అన్నమార్గము దోషించియున్నపుడు వాంతి, అతిసారము, యీరెండునుగాని యేదేనిందొక్కటిగాని వుండును. శూల, వొకప్పుడు కామలకలిగియుండును. తీవ్రముగు జ్వరదోషమున్నప్పుడు సకల ధాతువులు దోషింపబడి అభిన్యాస జ్వరలక్షణములు కలిగియుండును. స్వల్ప దోషముండి శీఘ్రముగ రోగము సంభవించిన చిరకాలమునను బలహీని కలుగును. ఈజ్వరమునందు దోషము లెక్కుడుయున్న కష్టసాధ్యము.

## —♦ విషాభిషంగజా ఆగంతుజ్వరాః ♦—

శ్లో. అథేదానీం ప్రసిద్ధామే కేచి దాగన్తవోజ్వరాః।
నానావిధ విషోద్ధానాస్తాన్ వక్ష్యామి సవిస్తరమ్।
ప్రాయేణహి విషంతేషు భవేత్ జీవాణుసమ్భవమ్।
క్వచిదన్యవిధం వాపి ద్విత్రిదోషప్రకోపణమ్।

సామాన్యరూపమ్:—

శ్లో. హేతు లింగపృథక్త్వేఽపి సామాన్యంతేష్విదంస్థితమ్।
విషం సర్వాశయాన్ ప్రాప్య కశ్చిత్ కన్యాపి పీడయేత్।
తతః శ్వాసశ్చ కాసశ్చ మోహోఽతిసరణం వమిః।
మూత్రరోధశ్చ హృత్పీడః సంశూలశ్చ కామలా।

అన్యేచోపద్రవాః కేఽపి ప్రాదుఃషన్తి ద్విశస్త్రిశః।
విషస్వభావవైచిత్ర్యాత్ క్షేత్రవైచిత్ర్యతస్తథా॥

విషాగంతుజ్వరభేదాః:—

శ్లో. ఆంత్రికో గంధికశ్చాపి శ్లేష్మకః సంధికస్తథా।
యశ్చ శ్వసనకోనామాఽఽక్షేపకో యశ్చవక్ష్యతే।
షడేతే విషజాఘోరాః సర్వధాతుప్రదూషణాః।
స్యుర్జానపదికాస్సర్వే జ్వరాః క్వాచనికా అపి।
మసూరికాద్యాయేచాన్యే భూవాయుజలదోషతః।
కాలే కాలే ప్రవర్తన్తే తేఽపి జ్ఞేయాశ్చ తాదృశాః।
దణ్డకాఖ్యో జ్వరో దుఃఖస్తథాన్యః కర్ణమూలికః।
ద్వౌ స్వల్ప విషజా వేతౌ సుఖసాధ్యౌ విదుర్బుధాః
సంక్రామంతిచ సర్వేఽపి శ్వసనస్పర్శనాదిభిః।

తా. ఇకను నానావిధవిషములవలనజనించెడు కొన్ని ఆగంతుకజ్వరములనుగూర్చి చెప్పుచున్నాడు. తఱుచుగ ఆగంతుక జ్వరములు విషక్రిములవలన సంభవించును. ఒకప్పుడు వాతాదిత్రయమునందే రెండు దోషములయొక్క-గాని లేక మూఁడింటియొక్క-గాని కారణముచే జనించును.

ఆగంతుక జ్వరములయందు కొన్నికొన్ని కారణములు, కొన్నికొన్ని లక్షణములు వేఱైయున్నను ఈక్రిందిలక్షణములు మాత్రము సామాన్యముగా అన్ని ఆగంతుక జ్వరములయందును సమానమై యుండును. ఎవనియొక్క-

పర్యాశయములను యీపైవిషము పొందునో వానికి ఆయాసము, దగ్గు, మూర్ఛ, అతిసారము, వాంతి, మూత్రవరోధము, గుండెబరువు, కీళ్ళనొప్పులు, కామల యింకను మరికొన్ని వుపద్రవములు రెండుమూడు విధములుగా రోగియొక్క తత్వము ననుసరించియు, విషస్వభావమునుబట్టియు కల్గును.

ఆంత్రికజ్వరము, గ్రంధికజ్వరము, శ్లేష్మకజ్వరము, సంధికజ్వరము, శ్వాసనకజ్వరము, ఆక్షేపకజ్వరము యీఆరును విషమువలన జనించి ఘోరములై సప్తధాతువులను దోషింపజేయును. ఈఆగంతుజ్వరములన్నియు పల్లెలయం దెక్కుడనో గాని బయలుదేరవు. పట్టణములయం దెక్కువగ సంభవించును. మసూరిక మొదలైన యితరజ్వరములు, భూ, వాయు, జలదోషములనుబట్టి ఋతువులయందు కలుగుచు, ఆగంతుకజ్వరములవలె ఘోరములై యుండును. దండకజ్వరము, కర్ణమూలికజ్వరము, స్వల్పదోషమువలన కలుగును. అవి సులభసాధ్యములై యుండును. ఈజ్వరములన్నియు రోగి విడిచిన గాలి మరియొకరు పీల్చుట, రోగినితాకుట యీమొదలైన కారణములచే యితరులకు సంక్రమించును.

## —♦ ఆంత్రికజ్వర నిదానమ్. ♦—

నిదానమ్:—

శ్లో. అధోపవాస క్లిష్టానాం, దుర్గన్ధానికవాసినాం।
ప్రాయో మలాది సంసృష్ట భక్ష్య పానోపయోగతః।
సర్వేష్వేవర్తుషుప్రాయో గ్రీష్మ వర్షా శరత్సుతు।
విశేషాదాంత్రికఃకృచ్ఛ్రి జ్వరస్యాద్ ఘోరలక్షణః।
తస్యజీవాణవః కేచిన్మల మూత్రాది సంభవాః।
విసిష్టంతు నిదానంస్యుః అధాన్యాశ్రియణశ్చతే।

సంప్రాప్తిః:—

శ్లో. రసం రక్తఞ్చ దోషాంశ్చ కోపయన్త్యచిరాదపి।
క్షీణ్వన్తి చాన్త్రమంభాగం క్షుద్రాన్త్రాణాం శనైశ్శనైః।
తతోఽన్త్రక్షత సంవృద్ధా క్వచిద్రక్తస్య నిఃస్రవః।
భిన్నాన్త్రాఽధవాఽ సాధ్యే త్యేష వై కృతనిశ్చయః॥

పూర్వరూపమ్:—

శ్లో. శిరోరుగరుచి సాదో విడ్విబన్ధోఽ రతిస్తమః।
ప్రాయ స్ఫుటాస్ఫుటం పూర్వ లిఙ్గంస్యాదాన్త్రికే జ్వరే॥

రూపమ్:—

తదేవ సజ్వరం రూప మష్టాహేనస్ఫుటీభవేత్।
జ్వరశ్చ వర్ధతే నిత్యం క్రమాఽఽరోహేణ లక్షితః।
ప్రాయశో దృశ్యతే కిఞ్చిత్ ప్లీహ్నశ్చాప్యభివర్ధనమ్।
క్వచిచ్చ్వసమ్భవలయా గాత్రేష్వా రక్త లక్ష్మణామ్।
షష్ఠాహాత్ పరతః ప్రాయః క్వచిన్నైవ చిరేణవా।
చణముద్గాది యూషాభం సాధ్మాన మతిసార్యతే।
అథ ద్వితీయే సప్తాహే ప్రవృద్ధస్త్విష్టతిజ్వరః।
తదాస్యరరతిస్తన్ద్రా ముఖశోషః ప్రమూఢతా।
కాసః ప్రలాపో దౌర్బల్య మాధ్మానఞ్చ విశేషతః।

జిహ్వాచ రక్త పర్యంతా కర్కశా స్ఫుటితోపమా
సంతాపోఽ భ్యధికశ్చాపి ధమనీ నాతిచఞ్చలా
సాన్నిపాతికలిఙ్గానామన్యేషాఞ్చాపిసమ్భవః
యథాస్యదోష పాకేన నై రుజ్యే సమ్భవిష్యతి।
ప్రాయస్తృతీయే సప్తాహే క్వచిత్తుర్యేఽథవాపునః
జ్వరస్సోపద్రవగణః క్రమేణై వాఽవరోహతి।
వైషమ్యం నైతిముఞ్చేత్తు సద్వా వింశతివాసరైః।
ద్వా చత్వారింశతాఘస్రైః క్వచిద్ వా ముఞ్చతిజ్వరః।
క్రమారోహావరోహాభ్యాం బునర్దర్శిత లక్షణః।
దశాహాత్ పరతః క్వాపి దారుణో రక్తనిస్రవః।
సోఽతికృచ్ఛ్రే భవేజ్జాతు తతోఽప్యారోగ్యసమ్భవః।
సన్నిపాతజ్వరాన్నోక్తమాధివ్యాధిశ్చవైకృతమ్।
కస్యాపి జాయతే తచ్చ పాయశ్శా మ్యత్యుపక్రమాత్॥

తా. మార్గమునం దుపవాసము చేయుటచేత సంభవించినకష్టము కలవారలకున్ను, ధుర్గంధముగల స్తలములయం దుపవాసము చేయువారికిని, మలినమైన ఆహారపానీయసేవనచేయువారికిని యీఆంత్రికజ్వరము సంభవించును. ఈ జ్వర మన్నిఋతువులయందును కలుగును. తరుచు గ్రీష్మఋతువు, వర్ష ఋతువు, శరదృతువు, వీనియందు కలుగును. మలమూత్రములయందు క్రిమి దోషమున్నవారికీవ్యాధి తరుచుగ సంఘవించును. క్రిములు మలమూత్రములతో గూడి పేగుల నాశ్రయించి యుండును.

క్రిములు శీఘ్రముగ రసరక్తములను, వాతాదిదోషములను చెరచి రోగమును వృద్ధిబొందించును. ఈక్రిములు పిల్ల పేగులయొక్క మధ్యభాగమును మెల్ల మెల్లగ పీడించును. నరుకులు వృద్ధిజెందినతరువాత ప్రేగులయందు రక్తపాతము కలుగును. పేగులు తెగి రక్తముపడిన రోగమసాధ్యము.

తలపోటు, వాంతి, కాళ్ళలుబరువు, మలబద్ధము, ఏపనియందును యిష్టములేకుండుట, బద్ధకము, యివి ఆంత్రికజ్వరమునకు పూర్వరూపములు.

ఈజ్వరము దినదినాభివృద్ధిని జెంది యెనిమిదిరోజులకు పూర్ణమైన లక్షణములు కనుపించును. ప్లీహ కొద్దిగ పెరుగును. ఒకానొకప్పుడు శరీరమునందు యెర్రని మచ్చలు బయలుదేరుచు నసించుచుండును. అయిదురోజుల తరువాతగాని చిరకాలమునకుగాని కడు పుబ్బరించి శనగ, పెసర కడుగుల బోలి విరేచనములగును. ఈజ్వరము రెండవరోజున, ఏడవరోజున యెక్కువ తీవ్రముగానుండును. ఏపని చేయుటయందును యిష్టము లేకుండుట, కునికిపాట్లు, నాలుకయెండుట, స్పృహ తెలియకపోవుట, దగ్గు, ప్రలాపము, దౌర్బల్యము, కడుపుబ్బరము, నాలుకయెర్రగా నుండి కఠినమై బద్దలయినట్లుండుట కలుగును. శరీరతాపమధికముగా నుండుట, నాడి మందగతినిబొందుట, యీలక్షణములును యితరములైన సన్నిపాతలక్షణములును కలిగియుండును. దోషములు పరిపాకమును బొందినపిమ్మట ఆరోగ్యము కలుగును. తరుచుగ మూడవరోజున, ఏడవరోజున, నాల్గవరోజున జ్వరోపద్రవములు క్రమముగా తగ్గును. ఈజ్వరము 22 రోజులకుగాని 42 రోజులకుగాని విడుచును. క్రమముగ హెచ్చుతగ్గులచే తిరిగి పైలక్షణములే కలిగి పదిరోజులపిమ్మట నొకప్పుడు దారుణమై రక్తస్రావము కలిగి నొకానొకప్పుడు వ్యాధి కష్టతరమగును. నొకప్పుడు రోగి జీవించును. సన్నిపాత జ్వరాంతమందు చెప్పబడిన అధివ్యాధులచే వికృతమై తరుచుగా మృత్యువు కలుగును.

## ఆక్షేపకజ్వరనిదానమ్.

పరిచయః—

శ్లో. ఆక్షిప్యన్తే యతోఽఙ్గాని సఙ్కోచం యాన్తి చాఞ్జసా।
ఘోరోజ్వరశ్చ సంజ్ఞాహ్రృత్ సోఽయమాక్షేపకోజ్వరః॥

నిదానమ్:—

శ్లో. వసతాం సంకులేదేశే ధూలిధూమాకులే చిరమ్।
దరిద్రాణాం భవేద్ భూమ్నా సోఽయం జీవాణు
సమ్భవః॥

సంప్రాప్తిః—

శ్లో. మస్తిష్క మూలే పరితః సుషుమ్నాకాణ్డం చ తచ్ఛాదికలాన్తరాలే।
విషంక్రిమాత్ పూయసమాం లసీకాం సంహత్యదోషాన ఖిలాన్ ప్రకోప్య।
చేష్టావహానా మధనాడికానా ముత్తేజనాదాక్షి పదఙ్గకాని।
సఙ్కోచ్యశాఖాశ్చనిహన్తి సంజ్ఞా మాక్షేపకే దుర్లభజీవిత
స్స్యాత్॥

రూపమ్:—

శ్లో. తీవ్రా శిరోరుగ్ వమథుః శీత కమ్పాచ జాతుచిత్
గ్రీవాస్తమ్భః క్రిమాచ్ఛీర్షం పశ్చాదాకృష్యతే బలాత్

జ్వరశ్చ వర్ధతే నిత్యం శాఖాఃస్తబ్ధా భవన్తి చ।
సఙ్కోచం యాన్తి చాఙ్గాని దృష్టీ యాతశ్చవక్రతామ్।
తన్ద్రా ప్రలాపో మోహశ్చ హ్యాక్షేపశ్చాన్తరాన్తరా।
లక్ష్మణాం శ్యావరక్తానాం గాత్రేషుచ సముద్భవః।
సర్వేంద్రియ ప్రణాశశ్చ క్రమాదాక్షేపకే జ్వరే।
ఏకాహాన్మ్రియతే కశ్చిద్ త్ర్యహా ద్వా దారుణే గదే।
క్లిశ్యంస్త్రి చతురాణ్ వా౽ థసప్తాహాన్ విజహాత్యసూన్।
క్వచిచ్చతుష్పాత్ సంపత్తౌ దిష్ట్యాకశ్చన జీవతి॥

తా. కాలు సేతులు విదలించుట, అవయవములు ముడుచుకొనిపోవుట, చేష్టలుదక్కియుండుట, ఆక్షేపకజ్వరమునకు చిహ్నములు.

చిరకాలము దుమ్ము, పొగ మొదలగువానిచే నావరింప బడినట్టియు, క్రిక్కిరిసినట్టియు ప్రదేశములయందు నివసించు దరిద్రులకు విషక్రిములచే జనించునట్టి యీజ్వరము సంభవించును.

జీవాణుసంభవమైన విషము మెదడుయొక్క మూలభాగమున సుషుమ్నా నాడిని చుట్టియుండెడు కలలలోపల చీముతో సమానమైన లసీకమును హరించి సకలదోషములను ప్రకోపింపజేసి చేష్టలను గలిగించునట్టి నాడులకు కదలికను కలుగజేసి కాలు సేతుల విదలింపజేసి అవయవములను ముడువజేసి చేష్టలను హరించును. ఈజ్వరపీడితులు బ్రతుకుట దుర్లభము.

మిక్కిలి తలపోటు, వాంతి, చలి, కుదుపు, ఒకప్పుడు మెడ త్రిప్పలేక పోవుట, క్రమముగ తల వెనుకకు లాగబడుట, జ్వరము దినదినాభివృద్ధినొందుట, కాలు సేతులు స్తంభించుట, అవయవములు ముడుచుకొనిపోవుట, వెర్రిచూపు కలుగుట, కునికిపాటు, ప్రలాపము, మూర్ఛ, యీలక్షణములు ఆక్షే

పకజ్వరమునందు మధ్యమధ్యకలుగుచుండుట, శరీరమందంతటను నలుపునెరుపుతోగూడిన మచ్చలు బయలుదేరుట, ఇంద్రియములయొక్క పని నశించుట, యీలక్షణములు వరుసగా బయలుదేరును. ఒక్కొక్కడు యీరోగము సంభవించిన తొలిదినముననే మృతినొందును. కొందరు రెండు మూడుదినములలో దక్షిణదిక్కునకు ప్రయాణము కట్టును. మరికొందరు నాలుగు లేక ఏడురోజులలో యమాలయమునకు తప్పక అరుగుదురు. ♦ పాదచతుష్టయ సంపత్తిగలిగిన వోకానొక రోగి దైవబలముచే జీవింపవచ్చును.

## —♦ గ్రంధికజ్వరనిదానమ్ ♦—

పరిచయః:—

శ్లో. ప్రాయోవంక్షణ కక్షాదిగ్రన్థి శోఫరుజాకరః।
జ్వరోజనపదోద్ధ్వంసీ గ్రన్థికాఖ్యో భయప్రదః।
హేతౌతుల్యేఽపిసక్వాపి భృశం ఫుప్ఫుసదూషణాత్।
సద్యః శోణితని ష్ఠీవశ్వాసకాసైర్హరేదసూన్।
అథవాసర్వధాతూన్ ద్రాగభిదూషయన్
అభిన్యాసస మైర్లింగైః సోఽశ్రన్థిమపిమారయేత్॥

నిదానమ్:—

శ్లో. నిదానమత్ర సామాన్యం సఙ్కులావసథాదికమ్।
విశిష్టంతు విషం రక్తచరం జీవాణు సమ్భవమ్।
తేస్పర్శశ్వసనాదిభ్యః సంక్రామన్తినరాన్నరమ్।

♦ పాదచతుష్టయము;—రోగి, వైద్యుడు, దాది, ఔషధము.

ప్రియస్త దోగ్రజుష్టేభ్యో మూషికేభ్యశ్చసంక్రమః।
ఆదావేవజ్వరస్తీవ్రః క్వచిన్మందోఽథవాపునః।
భృశం స్రంస్తాఙ్గతాతృష్ణా ప్రలాపో మూర్ఛనంభ్రమః।
నిద్రానాశోఽరతి ర్మోహో మత్తవత్ కోఽపితామ్యతి।
శేతేవిసంజ్ఞోవాప్యన్యో యథాఽభిన్యాసపీడితః।
దగ్ధవత్ కర్కశాజిహ్వా ధమనీ శిథిలాభృశమ్।
గ్రన్థాశోఫః క్వచిత్ పూర్వంక్వచిన్మధ్యే క్వచిచ్చిరాత్।
తోదః స్పర్శాఽ సహత్వఞ్చగ్రన్థాపాకశ్చిరాదపి।
ద్విత్రైర్వాపఞ్చషైర్వాపి దశభిర్వాదినైః క్వచిత్।
సద్యోవామ్రియతేరోగీ చిరా ద్వాకోఽపిసిధ్యతి।
మూత్రావరోధః కాసశ్చతథాతీసార ఉల్బణః।
ఛర్దిశ్చరక్త పిత్తఞ్చగ్రన్థికేష్వురుపద్రవాః॥

సాధ్యలక్షణమ్:—

శ్లో. గ్రన్థీనాంశీఘ్రపాకేన బహూనాంవా సముద్భవాత్।
జరన్వాబాలకోవాఽపిరోగీజీవేత్కథఞ్చన॥

అరిష్టలక్షణమ్:—

శ్లో. శీఘ్రమింద్రియనాశేనసద్యః సంజాత్ర్యేణ వా।
అతీసారేణవాఽఽ క్రాన్తోగ్రన్థి రోగీనజీవతి।
అకృష్ణం సకఫం రక్తం ష్ఠీవేత్ యః శ్వాసపీడితః।
ఆక్రాన్తఫుప్ఫుసఃసోఽయమసాధ్యః సర్వథాస్మృతః।
అగ్రన్థిర్గ్రన్థికోక్తైశ్చలిఙ్గైర్యుక్తోయమాతిథిః॥

తా. తరుచుగా వృషణములు, చంకలు వీనియందు బిళ్ళలు బయలు దేరును. వాపు, సలుపు గలిగించెడు యీ గ్రంధికజ్వరము దేశములనాశనము చేయును. తుల్యదూష్యములయినప్పటికి ఊపిరితిత్తులను శీఘ్రముగ పాడుచేసి రక్తముతోగూడిన వుమ్మిచేత, ఆయాసము, దగ్గు వీనిని కలిగించి ప్రాణములనుహరించును. లేక సమస్తధాతువులను శీఘ్రముగ దూషింపజేసి అభిన్యాస జ్వరలక్షణములతోగూడిన గ్రంధికజ్వరము రోగిని నశింపజేయును.

ఇండ్లు క్రిక్కిరిసియుండుటచే సామాన్యముగా యీగ్రంధికజ్వరము కలుగును. విషక్రిములు రక్తమున ప్రవేశించుట అను విశేషకారణముచే గూడ యీవ్యాధికలుగుచున్నది. ఈజ్వరముగల రోగిని తాకుట, రోగి విడిచినగాలిని పీల్చుట మొదలగుకారణములచే నొరులకు యీవ్యాధి సంక్రమించును. తరుచుగ ఈరోగము గలిగిన యెలుకలనుండి మనుష్యుల కీవ్యాధి వ్యాపించును. ప్రారంభదశయందే ఈజ్వరము తీవ్రముగా నుండును. ఒక్కొక్కప్పుడు మందముగ నుండుటయు కలదు. అవయవములు పట్లు వీడుట, దప్పి, ప్రలాపము, మూర్ఛ, ఒడలుతిరుగుట, నిద్రపట్టకుండుట, ఉత్సాహములేకపోవుట, మోహము, బద్ధకము, శరీరమువాడియుండుట, అభిన్యాసజ్వరపీడితునివలె చేష్టలుదక్కియుండుట, నాలుక కాలినట్లుండి మొద్దుబారియుండుట, నాడిమిక్కిలి హీనగతినిజెందుట, బిళ్ళయందు వాపుఒకప్పుడు ప్రథమదశయందును, మఱియొకప్పుడు మధ్యదశయందును, వేరొకప్పుడు చిరకాలమునకును గలుగుచుండును. తాకినంతమాత్రముననే నొప్పిగలిగి బిళ్ళలు చిరకాలమునకు పరిపక్వమగును. రెండుమూడు దినములయందుగాని, అయిదారుదినములయందుగాని లేక పదియవ దినమునందుగాని లేక మొదటి దినమునందేగాని యీజ్వరము రోగినిజంపును. చిరకాలమునకు ఒకానొకడు మాత్రము జీవింపవచ్చును. మూత్రవరోధము, దగ్గు, అతిసారము, శరీరము వాపు, డొకు, రక్తపిత్తము; యివి గ్రంధిక జ్వరమునందు గల్గెడి వుపద్రవములు.

గ్రంథులు శీఘ్రకాలములో పాకమును పొందినను విశేషముగ గ్రంథులు జనించినను ముసలివారైనను బాలురైనను తప్పక జీవింతురు.

శీఘ్రముగ యింద్రియములయొక్క వ్యాపారములు నశించినను, చేష్టలు దక్కియుండినను, అతిసారము గలిగినను యీగ్రంథికజ్వరము గలరోగి బ్రతుకడు. ఆయాసముకలిగి కఫముతో కలసి రక్తముపడి వూపిరితిత్తులు పాడయినచో రోగి జీవింపడని తలంపవలయును. బిళ్ళలున్నను లేకున్నను గ్రంధికజ్వరలక్షణములన్నియు కలిగియుండిన రోగి బ్రతుకడు.

## సంధికజ్వరనిదానమ్.

పరిచయః—

శ్లో. వ్రణశోథరుజాతోదైః సన్ధీనాపీడయన్ భృశమ్।
జ్వరో ఘోరః సహృదోగః సన్ధికో నామకథ్యతే॥

నిదానమ్, సంప్రాప్తిశ్చః—

శ్లో. హేమంతేశిశిరేచర్తౌ బాల్యేవా యావనేఽపివా।
నిశ్శఙ్కశీతవర్షాది సేవయాఽపచితేబలే।
విషం జీవాణు సమ్భూతం ధాతుషు ప్రసృతం గలాత్।
వాతపిత్తోల్బణం దేహే సన్నిపాతముదీరయేత్।
తతశ్చ పరితః సన్ధీన్ వ్రణశోథోఽతి ధారుణః।
అంతస్సంధిబలాసశ్చ వర్ధమానో విదహ్యతే।
అభిశోహృదయం కిఞ్చ సఞ్చయోఽపాంకలాపుటే।
హృన్మధ్యే హృత్కపాటేవా వికారా వ్రణశోథజాః।

ఫుప్ఫుసే తత్కాలాశోధః క్వచిత్ సవ్యే ప్రజాయతే।
ఫుప్ఫుసాక్రమణంవాఽపి శ్వాసకాసాది లక్షణమ్॥
రూపమ్:—

శ్లో. జ్వరఃసాధారణః పూర్వం సన్ధిశోధస్తతఃక్రమాత్।
భృశం స్వేదో రుజాస్తీవ్రా మూత్రాల్పత్వం హృదివ్యథా।
సాన్నిపాతిక లిఙ్గానాం కేషాఞ్చి నచదర్శనమ్।
జ్వరోతిఘోరఃకుత్రాపి ప్రాణహృత్ సోఽనుపక్రమాత్।
యూనాం సంధిషు బాలానాం హృదయేచ విశేషతః
వికారాఃప్రాయశోదృశ్యాః సన్ధికాఖ్యేజ్వరేధ్రువమ్।
అథోపక్రమ నైపుణ్యాల్లాఘవా ద్వా విషస్యచేత్।
జీవతి ద్విత్రసప్తాహాత్ హృద్రోగీ ప్రాయశస్తునః।
పునరావర్తతే చాపి కేషాఞ్చిత్ సన్ధికో జ్వరః
సన్ధి శోథాదియుక్ తస్మాత్ మన్దమారోగ్యమశ్నుతే।
హృద్రోగా దాయతౌ దుఃఖం ప్రాయః సర్వస్యజాయతే।
సశ్రమ శ్వాస శోథాద్యైః సీదన్కాలే జహాత్యసూన్॥

తా. పొక్కులు, వాపు, పోటు, పీడతోకూడుకొని సంధులయందు మిక్కిలిపోటును కలుగజేయుచు హృద్రోగముతో కూడిన ఘోరమైన జ్వరము సంధికజ్వరమని చెప్పబడును.

హేమంత ఋతువునందుగాని, శిశిరఋతువునందుగాని, బాల్యమందుగాని, యౌవనమందుగాని, నిర్భయముగ చలి, వర్షము, శీతలాహార విహార

సేవనవీనివలన బలము క్షీణించినపుడు, జీవాణువులవల్ల పుట్టినవిషము కంఠము నుండి దేహమంతటను సంచరించినదై వాతపిత్తోల్బణమను సన్నిపాతమును గలుగజేయును. తరువాత దారుణమైన వ్రణములయొక్క వాపు అన్నికీళ్ళను పీడించుచున్నదై సంధులలోపల దహించుచున్నట్లుండి బాధ వృద్ధిబొందుచు దగ్గుతో గూడియుండును. హృద్యంత్రమందు వ్యాపించిన కలయొక్క సంపుటమందు చేరిన ఉదకసమూహము హృదయమంతటను, హృన్మధ్యమున, హృదయద్వారమున వ్రణశోధవలన కలిగినవికారముల గలుగజేయును. శ్వాసకోశమందలి పొరలయందు వాపుకలిగి,వొకప్పుడు శ్వాసకోశముయొక్క కుడిభాగమున మరివొకప్పుడు యెడమభాగమున లేక శ్వాసకోశమంతటను పైవిషము వ్యాపించి శ్వాసకాసల గలుగజేయును.

తొలుత సాధారణజ్వరము, పిదప కీళ్ళయందు వాపు, శీఘ్రముగ చెమట, తీవ్రమైనపోటు, కొద్దిగమూత్రము వెడలుట, హృదయమందు బాధ, కొన్నిసన్నిపాతలక్షణములు కనబడుట, ఒకప్పుడు జ్వరము తీవ్రతనొందుట, వొకప్పుడు జ్వరములేకున్నను మరణము సంభవించుట, యౌవనవంతులకు సంధులయందును, బాలురకు హృదయమందున విశేషముగ వికారములు కలుగుట ఈసంధికజ్వరమందు నిశ్చయముగ కనబడును.

చికిత్సానైపుణ్యమువలన, విషముయొక్క స్వల్పదోషమువలన తరుచుగ హృద్రోగి 2, 3, 7 రోజులయినపిదప జీవించును. కొంతమంది కీసంధికజ్వరము తిరిగివచ్చిన సంధులయందు వాపు మొదలైనవి కలిగి కొద్దిఆరోగ్యము మాత్రమే కలుగును. హృద్రోగమువలన తరుచుగ సర్వజనులకు చిరకాలమునకు ప్రమాదము (ప్రాణహాని) కలుగును. బడలిక, శ్వాస, ఉబ్బు, మొదలైనవానిచే రోగి కృశించి కొంతకాలమునకు మరణించును.

## దండకజ్వరనిదానమ్.

శ్లో. అస్థి సన్ధి రుజాస్త్వాన్తి దణ్డాహతి కృతా ఇవ।
ప్రాయఃశిరోదయలమో వీసర్పఃసర్వగాత్రగః।

జ్వరశ్చ కణ్ణరుగ్యుక్తః పునరావర్తతే గతః।
సఞ్చారిణా సశోథేన సన్ధిశూలేన లక్షితః।
ప్రతిశ్యా కాసయుక్తాప్రియ అష్టాహేనప్రముచ్యతే।
చిరం సన్ధిరుజాస్సన్తి సజ్ఞేయో దణ్డకజ్వరః।
సజానపదికః ప్రాయో వాతశ్లేష్మప్రకోపణః।
బాలానాం జరతాఞ్చాతి దారుణఃపరిలక్ష్యతే॥

తా. కఱ్ఱచేకొట్టబడిన రీతి అస్తి సంధులయందు తీవ్రమైనపోటుగలిగి, శీఘ్రముగ వృద్ధిక్షయములనొందుట, శరీరమంతయు వుండగుట గలిగి కంఠమందు పోటుతోకూడినదై జ్వరము వచ్చుచు పోవుచుండును. శూలతో కూడిన వాపు కీళ్ళయందు సంచరించుచుండును. పీనస, దగ్గుతో కూడినట్టి యీజ్వరము యెనిమిదిదినములకు విముక్తినొందును. చిరకాలము సంధుల యందు పోటుకలిగినది దండకజ్వరమని తెలియవలయును. వాతశ్లేష్మములు ప్రధానమై యీజ్వరము పట్టణములయందు మాత్రము జనించును. బాలురకు ముసలివాండ్రకు యీజ్వరము సంభవించిన కష్టసాధ్యము.

## వివిధజ్వరప్రసంగః.

— ఉపద్రవికజ్వరః:—

శ్లో. సర్వేషు జీర్ణరోగేషు గ్రహణ్యాదౌ విశేషతః।
దోషత్రయప్రకోపేణ స్యాదుపద్రవజోజ్వరః॥

తా. చిరకాలమునుండి రోగములు జీర్ణించినపుడును, విశేషించి గ్రహణి జీర్ణించినపుడును దోషత్రయము ప్రకోపించి వుపద్రవ జ్వరమును కలుగజేయును.

దేశాన్తరీయజ్వరాః:—

శ్లో. దేశాన్తరేషు దృశ్యన్తే శోణ హారిద్ర కాదయః।
జ్వరాః కేచిత్ప్రవిరలాశ్చిన్త్యన్తే నేహతేపృథక్॥

తా. దేశాంతరములయందు శోణము, హారిద్రము మొదలైనకొన్ని జ్వరములు అరుదుగా కలుగుచుండును. వీనినే దేశాంతర జ్వరము లందురు.

అనన్తభేదజ్వరాః:—

శ్లో. నాన్తోఽస్తి జ్వరజాతీనాం దేశకాల విశేషణాత్
అసంఖ్య ప్రాయరూపాస్తే లక్ష్యాః శాస్త్రనిదర్శనాత్॥

తా. దేశకాల విశేషములనుబట్టి జ్వరజాతు లనంతములు. యీయసంఖ్యాకములైన జ్వరముల లక్షణములు శాస్త్రమునుబట్టి గ్రహింపనగును.

## ఖ ఞ్జ ని క రో గ ని దా న మ్.

శ్లో. ఖఞ్జన్యదనసాతత్యా దనిలో వికృతింగతః।
సంక్థిసంజనయేద్వ్యాధిం ఘోరం ఖఞ్జనికాభిధమ్।
ఖఞ్జనీయామునేదేశే బాహుల్యేనప్రజాయతే।
తస్యాస్సమశనాత్తత్ర పీడ్యన్తే వ్యాధినాజనాః।
ప్రోక్తో కలాయఖఞ్జాఖ్యో వాతవ్యాధిప్రసంగతః।
సఏవా యమితిప్రాహుః కేచిదన్యం వదన్తి వా।
శైత్యే నార్ద్రతయాచాపి వ్యాధిరేష వివర్ధతే।
స్త్రీభ్యః పుంసామయం వ్యాధిర్బాహుల్యే నాభిజాయతే।
సుప్తోత్థి తస్యోపసిజానుసంధౌ రుజాచ గుర్వీచ దృఢాచ జంఘా।

కకుద్మతీ క్షీణబలాతతో౽నా సో౽ఙ్గుష్ఠమాకృష్య చలేత్
సుకృచ్ఛ్రమ్
వక్రత్వం జానుసంధేశ్చ జఙ్ఘాయాశ్చాపి శీర్ణతా।
పాదసంస్థానవైరూప్య మరతిశ్చాత్ర సంభవేత్॥

తా. ద్విదళబీజములను విశేషముగ సేవించుటవలన వాతము వృద్ధిజెంది పూరువులయందు ఘోరమైన ఖంజనికమను వ్యాధి జనించును. ఈవ్యాధి దక్షిణదేశమందు విశేషముగ జనించుచున్నది ద్విదళబీజములయొక్క అధిక సేవనవలన దక్షిణదేశప్రజలు యీవ్యాధిచే పీడింపబడుచున్నారు. ఈవ్యాధి వాతవ్యాధులయందు కలాయఖంజమని చెప్పబడినదని కొందరును, ఖంజనిక వ్యాధి వేరని మరికొందరును చెప్పుచున్నారు. ఈవ్యాధి చల్లదనముచేతను చెమ్మప్రదేశముచేతను వృద్ధిజెంది స్త్రీలకంటె పురుషులకధికముగ కలుగుచున్నది. నిద్రపోయి ప్రాతఃకాలమున లేచినవానికి మోకాళ్ళయందు పోటు, బరువు, పిక్కలుబిగిసి మూపులు కలిగియుండుట, బలము క్షీణించుట కలిగి బొటనవ్రేళ్ళు బిగబట్టి అతికష్టముపై నడుచును. మోకాళ్ళయందు వంకరగుట, పిక్కలు వీడినట్లుండుట, పాదము లానలేకపోవుట, బలహానియు సంభవించును.

## వా ధ క రో గ ని దా న మ్.

శ్లో. రక్తమాద్రీ తథాషష్ఠ్యఙ్కురో జలకుమారకః।
వాధకా ఇతి చత్వారః ప్రజా జనన వాధకాః॥

రక్తమాద్రీ:—

శ్లో. వ్యథా కట్యాం తథా నాభే రధఃపార్శ్వేస్తనే౽పిచ।
రక్తమాద్రీ ప్రదోషేణ జాయతే ఫలహీనతా।

మాసమేకం ద్వయంవాపి ఋతుయోగో భవేద్యది।
రక్తమాద్రీ ప్రదోషేణ ఫలహీనా తదాభవేత్॥

షష్ఠీ:—

శ్లో. నేత్రే హస్తే భవేజ్జ్వాలా యోనౌ చైవ విశేషతః।
లాలాసంయుక్త రక్తశ్చ షష్ఠీ వాధకయోగతః।
మాసైకే నభవేద్యత్ర ఋతుస్నాన ద్వయంతధా।
మవినా రక్తయోనిస్యాత్ షష్ఠీ వాధకయోగతః॥

అంకురః:—

శ్లో. ఉద్వేగో గురుతా దేహే రక్తస్రావో భవేత్ బహుః।
నాభే రధో భవేచ్ఛూలం చాఙ్కురః సతువాధకః।
ఋతుహీనా చతుర్మాసం త్రిమాసంవా భవేద్యది।
కృశాఙ్గీ కరపాదేచ జ్వాలాచాఙ్కురయోగతః।

జలకుమారకః:—

శ్లో. సశూలాచ సగర్భాచ శుష్కదేహోల్ప రక్తికా।
జలకుమారేణ దోషేణ జాయతే ఫలహీనతా।
యాకృశాఙ్గీ భవేత్ స్థూలా బహుకాలమృతుస్తధా।
గురుస్తనీ స్వల్పరక్తా జలకుమారక దూషణాత్॥

తా. రక్తమాద్రి, షష్ఠీ, అంకురము, జలకుమారకము అని నాలుగువిధములుగ సంతానవిరోధకమగు వాధకరోగము చెప్పబడెను.

కటిప్రదేశమున, నాభికి క్రిందిభాగమున, పార్శ్వమందు, స్తనములయందు, పీడ, రక్తమాద్రీ దోషముచే కలుగును. ఒకమాసమునకు గాని రెండు

మాసములకుగాని ఋతుస్రావము కలిగినను రక్తమాద్రిదోషమువలన సంతానము కలుగదు.

షష్ఠీదోషముచేత నేత్రములయందు, హస్తములయందు, విశేషముగ యోనియందును మంట, నురుగుతో కూడినరక్తస్రావము కలుగును. ఒకమాసములో రెండుమారులు ఋతుస్రావము కలిగిన మలిన రక్తయోనికలదై షష్ఠీవాధకరోగమువలన బాధను బొందును.

అంకురవాధకరోగమందు తొందర, ఒడలుబరువు, విశేషముగ రక్తస్రావము, నాభికి క్రిందిభాగమున శూల కలుగును. నాలుగు మాసములకుగాని మూడుమాసములకుగాని వొకసారి ఋతుస్రావము కలిగి క్షీణదేహము కలదై హస్తపాదములయందు మంట కలిగియుండును.

జలకుమారకమను వాధకరోగమందు శూలతో గూడినగర్భము, కృశించిన దేహము, రక్తక్షీణము, సంతానహీనత, యివి కలుగును. కృశించిన స్త్రీ బహుకాలమునకు, ఋతుమతియయిబలసిన(శరీరము పెరిగిన)చో స్తనములువృద్ధి వొంది రక్తక్షీణముగలదై జలకుమారకదోషమువలన గర్భపతనము గలుగును.

## జరారోగనిదానమ్.

హేతుః:—

శ్లో. పంథాః శీతం కదన్నాని వయోవృద్ధాశ్చ యోషితః।
మనోఽభిఘాతః కాలశ్చ జరాయా హేతవోహి షట్॥

పూర్వరూపమ్:—

శ్లో. హానిః క్రమాత్ క్రియాశక్తేః స్మృతిలోపశ్చ తత్క్రమాత్।
శ్వేతతా కేశపాశేషు వలీనాం త్వచి సంక్రమః॥

రూపాణి:—

శ్లో. పూర్వరూపోక్తచిహ్నానాం భృశతాగ్మిశ్చ మన్దతా।
మన్దతా సాహసే ధైర్యే యూనాం కార్యేషు సంశయః।
ప్రాయశః శ్లేష్మణో వృద్ధగళే వాసోఽనుభూయతే।
శోషరోష ఘృణాచిన్తాసముదాయోఽపి లక్ష్యతే।
వేపథుః పాణివాణీనాం స్ఖలనం పచ్ఛిరసఃక్వచిత్।
అగ్రతో నమనం తత్ర కాసశ్వాసస్వరామయాః।
వాతవ్యాధిముఖాశ్చాత్ర రోగా ధావన్తి దుర్ధరాః।
నచాత్ర క్లేశరాశీనాం క్షమాశక్తిర్విశిష్యతే।
యేచ పథ్యప్రతీకారసాధ్యా యూనిహి రుగ్గణాః
అత్ర తేఽపి చతుష్పాదసమ్పదా యాన్తియాప్యతామ్॥

సాధ్యతా:—

శ్లో. సాధ్య ఏష జరారోగః కృచ్ఛ్రసాధ్యోఽథవా పునః।
రసాయనసుయోగైశ్చ తన్నిదానవివర్జనాత్॥

తా. మార్గాయాసము, శీతలప్రదేశమున నివసించుట, అల్పాహారసేవన, వయోవృద్ధులయినస్త్రీలతో (తమకంటె పెద్దలయిన స్త్రీలతో) సంగమము, మనస్సుయొక్క కోరిక చెడుట, కాలము, యీఆరుకారణలచేతను జరారోగము సంభవించును.

పనులజేయుటయందు శక్తిక్రమముగ తగ్గుట, జ్ఞాపకశక్తి క్షీణించుట, జుట్టు తెల్లబారుట, చర్మమందు ముడతలుపడుట ఈలక్షణములు జరారోగమునకు పూర్వరూపములు.

పూర్వోక్తలక్షణములకు వేగము కలుగుట, అగ్నిమాంద్యము, మందము, సాహసధైర్యగుణులు తగ్గుట, యౌవనవంతులు చేయగలిగిన కార్యముల చేయుటయందశక్తత, తరుచుగ శ్లేష్మపూరితమైన కంఠముకలవాడై యుండుట, శుష్కించుట, కోపము, దయ, చింత యివి యెక్కువగ కనుపించుట, కంపము, హస్తములు, మాట వీనియందు వొణుకు, పాదములయందు శిరస్సునందు చలనము, నడ్డివంగుట, దగ్గు, ఆయాసము, స్వరామయము, వాతవ్యాధి మొదలైన రోగములు భరింపశక్యముగానివై యుండును. ఈజరారోగమందు దుఃఖమును వోర్వలేకుండును. ఏరోగములు యౌవనమున ప్రతిక్రియలచే సాధ్యమగునోయవి జరారోగమున చతుష్పాదసంపత్తి గలిగియు చిరకాలము బాధించును.

జరారోగము కష్టసాధ్యమైనను యోగ్యములైన రసాయనములచేతను, యేకారణములచే జరారోగము సంప్రాప్తించెనో ఆకారణకార్యముల వర్జించుటచేతను శాంతినొందును.

## ఖాలిత్యనిదానమ్.

శ్లో. నాడీనాం బలనాశాచ్చ వాతస్యాతిప్రకోపనాత్।
కర్మణశ్చాతిసాతత్యాత్ ఖాలిత్యం ఖలుజాయతే।
స్త్రీభ్యః పుంసామయం వ్యాధిర్యౌవనాత్ పరతస్తథా।
బాహుళ్యేనాభిజాయేత సద్భిరేవంనిరూపితమ్।
శాన్తిర్భారశ్చ హస్తస్య జాయతే తదనన్తరమ్।
అంగుల్యాః స్ఖలనాద్ధాని ర్భవేదారబ్ధకర్మణః।
లేఖనేఽక్షరదోషః స్యాత్ వాద్యే తాలవ్యతిక్రమః।
ప్రయత్నాద్ధపి దోగ్ధా గాం దోగ్ధుం సమ్యఙ్ నచార్హతి।
ఖాలిత్యం సుచిరం యస్య విద్యతే వ్యవసాయినః।
దృఢం ధారయితుం ద్రవ్యం న సశక్నోతి ముష్టినా॥

తా. ధాతువులయొక్క బలక్షీణము, వాతప్రకోపము, మిక్కిలిశ్రమ, వీనివలన స్థాలిత్యరోగము జనించును. ఈవ్యాధి స్త్రీలకంటె పురుషులకు యౌవనానంతరమున బాహుల్యముగ జనించుననని వైద్యపండితులచే చెప్ప బడుచున్నది. హస్తమున భారము, మాంద్యము, అనంతరము వ్రేళ్ళయొక్క తొట్రుపాటువలన ప్రారంభించిన పనిమానుట, వ్రాయుటయందు అక్షర దోషము, వాద్యమందు తాళమునుతప్పుట, ప్రయత్నపూర్వకముగ నైనను పాలను పితుకుటకు శక్తిలేకుండుట, ఈలక్షణములు స్థాలిత్యరోగమున జనిం చును. ఈవ్యాధి ప్రయత్నముకలవానికి జనించిన, వస్తువును గట్టిగ పిడికిలిచే పట్టుకొనుటకు సమర్థత లేకుండును.

## పారదవికారనిదానమ్.

శ్లో. శుద్ధః స్మృతోఽమృతం సాక్షాదశుద్ధస్తు రసోవిషమ్।
అయుక్తియుక్తో రోగాయ యుక్తియుక్తో రసాయనః।
విధివత్ సేవ్యమానోఽయం నిహన్తి సకలామయాన్।
తస్య మిథ్యోపచారేణ భవన్త్యేతే మహాగదాః।
పీనసో నాసికాభఙ్గో దన్తపాతః శిరోరుజా।
భగన్దరో విసర్పశ్చ నేత్రరోగో ముఖామయాః।
కోఠః కణ్డూస్త్వచాం వర్ణహానిర్నాసాదిషుక్షతమ్।
కుష్ఠోపదంశచిహ్నాని గాత్రేషు వివిధానిచ।
గ్రన్థివత్ శోథకాఠిన్యం సరుజం ఫలకోషయోః।
పక్షాఘాతో గ్రన్థివాతః ప్రదాహోఽస్థ్నాఇశ్చ దారుణః।
జాడ్యం మనోవికారశ్చ సర్వే కృచ్ఛ్రతమా గదాః॥

తా. శాస్త్రీయముగ శుద్ధిచేయబడిన రసము నిజముగ నమృతతుల్యమై యుండును. అశుద్ధరసము విషతుల్యంబగును. మరియు యోగమునందు యుక్త రీతిగ కలుపబడనిరసము రోగముకొరకును, యోగోక్తముగా చేర్చబడిన రసము రసాయనముగను నగును. శాస్త్రోక్తముగ సేవించబడినరసము సకల రోగములను నశింపజేయును. అట్టి రసమునకు క్షమమగు ఆహారవిహారముల చేత యీదిగువ నుదహరించిన మహావ్యాధులు జనించును. పీనస, నాసికాక్షయము, పండ్లూడుట, శిరస్సుపోటు, భగంధరము, విసర్పి, నేత్రరోగము, ముఖరోగములు, కోఠము (శరీరమున దద్దురులు) దురద, శరీరముయొక్క కాంతి నశించుట, నాసాదుల (ముక్కు, చెవి, పండ్లు, ముఖము) యందు కొరుకు, కుష్టము, సవాయి వీటిచిహ్నములు అవయవములయందు కానుపింపించుట, వృషణములయందు వాపు, పోటుతో కూడు కఠినమైన గ్రంధులు జనించుట, పక్షాఘాతము, గ్రంధివాతము, యెముకలలో దారుణమైనమంట, జడత్వము, మనోవ్యాధి యీ మొదలగు కష్టతరమైన వ్యాధులు జనించును.

## శీ ర్షాం బు రో గ ని దా న మ్.

శ్లో. మద్యాతిపానా దతిశైత్యయోగా ద్విరుద్ధభోజ్యా దనిల ప్రదోషాత్।
దుష్టాంబు పానా దభిఘాత తశ్చ తథాంత్ర మధ్యే క్రిమి సంభవాచ్చ।
శిరోగతస్నేహవృతౌక్రమేణ సంచీయతే తోయ మతిప్రభూతమ్।
శీర్షాంబునామా గదవేష పూర్వైః పరికీర్తితః కృచ్ఛ్రతరో భిషగ్భిః।

# మాధవనిదానశేషము.

ప్రియశైత్యశవే వ్యాధి ర్వివిధా హితసేవనాత్।
తథా దంతోద్గతే శేష బాహుల్యేనాభి జాయతే॥

పూర్వరూపమ్:—

శ్లో. జిహ్వా లిప్తాతి నిద్రిత్వం దౌర్బల్యం శ్వాస పూతితా।
గాఢ విడ్తాచ తస్మింస్తు భవిష్యతి భవిష్యతి॥

తస్యలక్షణమ్:—

శ్లో. శిరసో వేదనా ఘోర శ్రుతేర్దృష్టేశ్చ తీక్ష్ణతా।
మూత్రాల్పత్వం కృష్ణవిడ్త్వం ధమనీ వేగవాహినీ॥
త్వగూర్ధ్వక్లోష్మా తథా చ్ఛర్ది ర్విషమాచ కనీనికా।
కోపిత్వం ముఖవైవర్ణ్యం నిద్రాయాం దంతఘర్షణమ్।
కణ్ఠారోష్ఠస్య నాసాయా ఆక్షేపో రక్తనేత్రతా।
పక్షాఘాతః ప్రలాపశ్చ శీర్షాంబుగదలక్షణమ్॥

తా. మద్యపానాధిక్యమువలన, శైత్యోపచారమువలన, విరుద్ధాశనము వలన, వాతప్రకోపమువలన, కలుషజలపానమువలన, పడుటవలన, ప్రేగుల మధ్యమందు క్రిములుజనించుటవలన, విస్తారమగు ఉదకము శిరస్సును చెంది క్రమముగజిడ్డుగలదై వృద్ధినొందును. ఇయ్యది పూర్వవైద్యులచే కష్టతరమగు శీర్షాంబురోగమని చెప్పబడెను. తరుచుగ బాల్యమందు వివిధమైనఆహారసేవన వలనను, దంతోద్భవకాలమందున యీవ్యాధి జనించును.

నాలుక పూయబడినట్లుండుట, అతినిద్ర, బలహీనత, శ్వాస దుర్గంధ ముగనుండుట, మలము గట్టిగవెడలుట, యివి శీర్షాంబురోగమునకు పూర్వ రూపములు.

శిరస్సునందు ఘోరమగుపోటు, వినుటకు, చూచుటకు బాధగనుండు ట, మూత్రము స్వల్పముగవెడలుట, మలము నల్లగవెడలుట, నాడి యతివేగ

ముగనుండుట, చర్మము గరగరలాడుచు వేడిగనుండుట, డోకు, కనుపాప యందు వికృతిగలుగుట, కోపము గలుగుట, ముఖమందు కాంతిహీనము, నిద్రయందు పండ్లుకొరుకుట, దురద, పెదవి, ముక్కు అదరుట, నేత్రము లెఱ్ఱబారుట, పక్షాఘాతము, ప్రలాపము యివి శీర్షాంబురోగమునకు లక్షణములు.

## ఆగన్తుజపక్షాఘాతనిదానమ్.

శ్లో. పక్షాఘాతో ద్విధా జ్ఞేయో దోషాగన్తుజ భేదతః
దోషజః కథితః పూర్వమధునాగన్తుజం శృణు।
ఆగన్తుజో సజాయేత హేతోర్ద్ధేతుద్వయాత్మకః।
ఆద్యః పారదసమ్భూతో ద్వితీయో నాగజ స్స్మృతః॥

పారదహేతుజః:—

శ్లో. రససంస్పర్శసాతత్యా త్తద్ధూమస్య చ సేవనాత్।
పక్షాఘాతో భవేద్యస్తు సజ్ఞేయః పారదోద్భవః॥

తస్యలక్షణమ్:—

శ్లో. ఆదౌ బాహ్వోర్బ్బలధ్వంస స్తతః కమ్పః ప్రజాయతే।
వేపేతే సక్థినీ చాపి కాయ స్సర్వస్తతఃపరమ్।
నధారయే ద్దృఢం ద్రవ్యం నృత్యన్నివ చ గచ్ఛతి।
స్పష్టం ప్రభాషితుఞ్చాపి చర్వితుం సచనక్షమః।
తత స్తస్యాతినిద్రా చ ప్రలాపో బలసంక్షయః।
హృల్లాసోఽగ్నివధో దన్త ధ్వంసో లాలాస్రుతిః క్వచిత్।
శాన్తి ర్భవతి కమ్పస్య ధారితేఽఙ్గే కరాదిభిః।

నాగహేతుజః:—

శ్లో. నాగామయస్య లిఙ్గాని శృణుతా తస్సమాసతః।
చిత్రకృత్ప్రముఖా యేహి నాగైః కర్మ ప్రకుర్వతే
యే వా వ్యవహరన్త్యస్య పాత్రం తేషాం తతోగదః।
అంగుళీస్తు సమారభ్య మణిబన్ధం తతోఽఖిలమ్।
వ్యాధిర్వ్యాప్నోతి దౌర్బల్యం తత్రైకం లక్షణం మహత్।
అంసే ప్రకోష్ఠే తోదశ్చ బాహ్వోశ్చపరిశీర్ణతా।
నీలిమాదన్తవేష్టేచ శూలం చిహ్నానిచాస్య వై॥

తా. పక్షాఘాతరోగము దోషజమనియు, ఆగంతుకమనియు రెండు విధములు. దోషజము పూర్వులచే చెప్పబడెను. ఇపుడు ఆగంతుజపక్షాఘాతము వివరింపబడును. ఆగంతుజ పక్షాఘాతము రెండు హేతువులచేజనించును. పారదవికారముచే నొకటియు, నాగముచే మరియొకటియు జనించును.

పారదజమనగా అనవరతము రసస్పర్శవలనను రసధూమముయొక్క సేవనవలనను జనించిన పక్షాఘాతము.

ముందుగబాహువులయందు బలహాని, కంపము, తోడలు వొణుకుట, తరువాత శరీరమంతయు వొణుకుట కలుగును. గట్టిగ సేవస్తువును పట్టలేనివాడై నాట్యము చేయుచున్న వానివలె నడచును.

స్పష్టముగ మాటలాడుటకును, భుజించుటకును సమర్థత లేకుండును. తరువాత మిక్కిలినిద్ర, ప్రలాపము, బలహాని, హృదయమందు పీకు, అగ్నిమాంద్యము, దంతములూడుట, వొకప్పుడు చొంగకారుట, యీలక్షణములు కలిగి హస్తాదులచే శరీరము పట్టుకొనినపుడు కంపము శమించును.

నాగదోషముచే జనించు పక్షాఘాతమునకు లక్షణములు సమగ్రముగ చెప్పబడుచున్నవి. అవెవ్వి యనగ?

చిత్రకారుడు మొదలైనవారు సర్పములతో పనులను చేయుచుండుట వలనను, సర్పము నివసించు బుట్ట మొదలైన వస్తుసంబంధమువలనను, ఈ వ్యాధి సంభవించును. వ్రేళ్ళు మొదలు మణిబంధమువరకు నుండుప్రదేశము వ్యాధిచే వ్యాప్తమై బలహీనము ముఖ్యలక్షణమై యుండును. భుజశిరస్సుల యందు, ముంజేతులయందు పోటు, బాహువులు కృశించుట, పెదవులయందు నలుపు, శూల; ఈ మొదలైనలక్షణములు నాగజపక్షాఘాతమందు కలుగును.

## క్లైబ్యనిదానమ్.

శ్లో. బీజధ్వజోపఘాతాభ్యాం జరయా శుక్రసంక్షయాత్।
క్లైబ్యం సమ్పద్యతే తస్య శృణు సామాన్యలక్షణం।
సఙ్కల్పప్రవణో నిత్యం ప్రియాం వశ్యామపి స్త్రియమ్।
నయాతి లిఙ్గశైథిల్యాత్కదాచిద్యాతి వాయది।
శ్వాసార్త స్స్విన్నగాత్రశ్చ మోఘసఙ్కల్పచేష్టితః।
మ్లానశిశ్నశ్చ నిర్బీజ స్స్యాదేత త్క్లైబ్యలక్షణం।
సామాన్యలక్షణం హ్యేతద్విస్తరేణ ప్రవక్ష్యతే।
శీతరూక్షాల్పసంక్లిష్టవిరుద్ధాజీర్ణభోజనాత్।
శోకచిన్తాభయత్రాసాత్ స్త్రీణాం చాత్యర్థసేవనాత్।
అభిచారాదవిస్రమ్భాద్రసాదీనాంచ సంక్షయాత్।
వాతాదీనాంచ వైషమ్యాత్తథైవానశనాచ్ఛ్రమాత్।
నారీణామరసజ్ఞత్వాత్పంచకర్మాపచారతః।
బీజోపఘాతో లక్ష్యేః పాణ్డువర్ణ స్సుదుర్బలః।
అల్పప్రాణోఽల్పహర్షశ్చ ప్రమదాసు భవేన్నరః।

హృత్పాణ్డుతమకశ్వాసకామలాశ్రమపీడితః।
ఛర్ద్యతీసారశూలార్త కాసజ్వరనిపీడితః।
బీజోపఘాతజం క్లైబ్యం ధ్వజభఙ్గకృతం శుక్రజం।

అత్యమ్లలవణక్షారవిరుద్ధాజీర్ణభోజనాత్।
అత్యంబుపానాద్విషమాత్పిష్టాన్నగురుభోజనాత్।
దధిక్షీరార్ద్రభూమాంససేవనాద్వ్యాధికర్షణాత్।
కన్యానాం చైవ గమనాదయోనిగమనాదపి।
దీర్ఘరోగాం చిరోత్సృష్టాం తథైవ చ రజస్వలాం।
దుర్గన్ధాం దుష్టయోనిఞ్చ తథైవ చ పరిశ్రుతాం।
ఈదృశీం ప్రమదాం మోహాద్యో గచ్ఛేత్కామహర్షితః।
చతుష్పదాభిగమనాచ్ఛేఫసశ్చాభిఘాతతః।
అధావనాద్వా మేఢ్రస్య శస్త్రదంతనఖక్షతాత్।
కాష్ఠప్రహారనిష్పేషాచ్చూకానాం చాతిసేవనాత్।
రేతసశ్చ ప్రతీఘాతాద్ ధ్వజభఙ్గః ప్రవర్తతే।
భవన్తి యాని రూపాణి తస్య వక్ష్యామ్యతఃపరమ్।
శ్వయథుర్వేదనా మేఢ్రే రాగశ్చైవోపలక్ష్యతే।
స్ఫోటాస్తీవ్రాశ్చ జాయన్తే లిఙ్గపాకో భవత్యపి।
మాంసవృద్ధిర్భవేచ్చాస్య వ్రణాః క్షిప్రం భవంత్యపి॥

తా. ఉత్పత్తికారణమైన శుక్రదోషమువల్లను, లింగదోషమువలనను, ముసలితనముచేతను, శుక్రక్షీణమువలనను, క్లైబ్యరోగము పుట్టుచున్నది. దీని

యొక్క సామాన్యలక్షణము చెప్పబడుచున్నది. తనకు స్వాధీనమైనభార్యను, యెల్లప్పుడు భోగమునందు ప్రియత్నముకలవాడై లింగమందు లేవనశక్తిలేని కారణమున బొందదు. ఒకప్పుడు సంభోగించిన శ్వాసపీడితుడు, చెమటశరీర ముకలవాడు, వ్యర్థమైన సంకల్పముచేష్టకలవాడు, వాడిన లింగముకలవాడు, బీజములేనివాడునునైన నపుంసకుడని చెప్పవలెను. ఇది నపుంసకరోగమునకు సామాన్యలక్షణము. విశేషలక్షణము లెవ్వియనగా చల్లబడి ఆరిపోయి స్వల్ప మయి మలినమయి అధికమయియుండు అజీర్ణకర ఆహారసేవనవలన దుఃఖము, మనశ్చింత, భయము, సాహసము, స్త్రీలయొక్క అధికసేవన, వీనివలన వొక స్త్రీనే విస్తారముగ రమించుటవలన, విశ్వాసములేకుండుటవలన, రసాదిసప్త ధాతువులు క్షీణించుటవలన, వాతాదులయొక్క విషమగతివలన, ఉపవాస ము చేయుటవలన, మిక్కిలి వ్యాయామమువలన, స్త్రీలయొక్క శృంగార చేష్టల నెరుగకుండుటవలన, స్నేహ, స్వేద, వమన, విరేచన, అనువాసన కర్మలయొక్క అధికసేవనవలన శుక్రక్షీణము, పాండువర్ణము, బలహీనము, అల్పమైన ప్రాణశక్తి స్త్రీలయందు స్వల్పసంతోషము కలిగిన మనుష్యుడు క్లైబ్యరోగి యనబడును. హృదయము తెల్లబారుట, తమకశ్వాస, కామల, బడలికచే పీడ, డోకు,విరేచనములు, శూల, దగ్గు, జ్వరము వీనిచే పీడింపబడిన వాడు బీజోపఘాతజ క్లైబ్యరోగి యనబడును.

మిక్కిలిపులుపు, ఉప్పు, కారము, విషమమగు అజీర్ణభోజనము, విస్తా రవుదకపానము, న్యూనాధిక ఆహారము, పిండివంటలు, గురుకరాన్నము, పెరుగు, పాలు, వీనిసేవన, తడిప్రదేశమున నివసించుట, మాంసభక్షణ, వ్యా ధిచే కృశించుట, కన్యాసంగమము, స్త్రీకారణమునగాక శుక్రమును పోగొ ట్టుకొనుట, వీనివలన దీర్ఘరోగముగల స్త్రీని, చిరకాలము విడచిన స్త్రీని, రజస్వలాస్త్రీని, దుర్గంధయోనిగలదానిని, ప్రదుష్టయోనిగల స్త్రీని, స్రావ యోనిగలస్త్రీని, మోహమువలన కామోద్రేకముతో పొందుట, జంతుసంభోగ ము, లింగమునకు దెబ్బతగులుట, లింగమును కడుగకుండుట, కత్తి, దంతము,

గోళ్ళు వీనివలన లింగముగీయబడుట, కర్రదెబ్బలచే లింగము పీడింపబడుట, ముళ్ళుగలధాన్యసేవన, శుక్రనిరోధము, యీకారణములచే ధ్వజభంగజక్లైబ్య రోగము జనించును. తరువాత క్లైబ్యరోగికి జనించులక్షణము లెవ్వియనఁ? లింగమందు శోధ, సలుపు, ఎరుపు కనపడి తీవ్రమైనట్టియు పెద్దవైనట్టియు పొక్కులు జనించును. లింగము పుండుపడి మాంసవృద్ధిగలిగి శీఘ్రముగ వ్రణములు కలుగును.

వార్ధక్యమందు సప్తధాతువులు క్షయించును గాన ఏడవదైన శుక్రధాతువు స్వభావముగ క్షీణించి జరాక్లైబ్యము సంభవించును. శుక్రనష్టముచే చిరకాలము పీడింపబడి చికిత్సనొందకుండిన శుక్రముక్షీణించి శుక్రసంక్షయక్లైబ్యము సంభవించును.

## ఔపసర్గికోపదంశనిదానమ్.

శ్లో. బహుసఙ్కరసేవాభ్యాం సఞ్జాతో జననేన్ద్రియే।
వ్రణః కష్టతరో ఘోరో నానారోగప్రకాశకః।
జ్ఞేయో విషోపదంశో వా తథా పాపోపదంశకః।
కథిత స్సబుధై ః పూర్వైః పరస్పరసమాగమాత్।
వ్యాధి స్సఙ్క్రమతి స్త్రీతః పుంసి తస్యాం తతస్తథా।
అపత్యేషుచ జాయేత కులజోఽసౌ సుదారుణః।
ఉపదంశో ద్విధా ప్రోక్తో ముఖ్యగౌణప్రభేదతః।
ఇన్ద్రియస్యాదిమోదోషో ముఖ్యోఽన్యో దైహికస్తథా।
ఆరభ్యచ క్రియాకాలం సప్తాహత్రయమధ్యతః।
వ్రణో విషోపదంశస్య జాయతే జననేన్ద్రియే।

భవే దీర్ఘతరం కాలం యావన్తం సమతీత్య యః।
తథా కృచ్ఛ్రతరః సస్యాత్ బహుదుఃఖప్రదాయకః।
ద్విధా పాపోపదంశస్య వ్రణ స్స్యాత్కఠినోమృదుః।
ఆద్య స్సజ్వరకః కృచ్ఛ్రః సర్వదేహ పరితాపనః।
అపరో నచ సజ్వరమే త్కిఞ్చిద్దేహం నదూషయేత్।
ఏష సాధ్యతరః ప్రోక్తో నచ కష్టో యథాదిమః।
పుంసో మేఢ్రస్య ముణ్డేచ చర్మణ్యావరకే తథా।
భగద్వారే భగోష్ఠేచ జాయన్తే పిడకా స్త్రియః।
సమన్తా త్కఠినాస్తాస్తు విదీర్ణా రసవాహికాః।
దృఢమూలా మధ్యనిమ్నా జ్వరబధ్నాది దాయికాః।
ముఖ్యోపదంశ ఇత్యస్మిన్ శాన్తే ఽపి పునరేవహి।
వికృతిం వివిధాం కుర్యాత్ తద్విషం దేహసంస్థితమ్।
త్వగ్వికారాశ్శిరోగాచ కేశలోమ్నాఞ్చ సంక్షయః।
గ్రన్థిపీనసకుష్ఠాని గౌణోపదంశలక్షణమ్।
విషం పాపోపదంశస్య శ్లేష్మగ్రన్థిషు సంసృతమ్।
జనయేత్ బ్రధ్నరోగంచ సజ్వరం బహుదుఃఖదమ్॥

తా. అనేకపురుషులను అనేకవిధములుగ సేవించుటవలన జననేంద్రియమునందు పుట్టినవ్రణము కష్టతరమై, భయంకరమై నానారోగములకు కారణమై విషోపదంశమనియు, పాపోపదంశమనియు, పండితులచే రెండు విధములుగ చెప్పబడెను. అట్టి స్త్రీపురుషుల పరస్పర సంబంధమువలన యీ వ్యాధి స్త్రీవలన పురుషునకు, పురుషునివలన స్త్రీకి సంభవించును. క్రమము

గ సంతానమందును, కులమందును దారుణమై యీ ఉపదంశము రెండువిధము లైన ముఖ్య, గౌణభేదములచే పుట్టును. మొదట యింద్రియ దోషముచే జనించినది ముఖ్యోపదంశమనియు, పరస్పర సంభోగదోషముచే జనించినది గౌణమనియు చెప్పబడును. ఇది సంభోగకాలము మొదలు మూడు ఏడు రాత్రులమధ్యను లింగమందు విషతుల్యమైన ఉపదంశరోగమున వ్రణము జనించును. కాలము గడచినకొలదిని కష్టతరమై బహుదుఃఖమును కలుగ జేయును. పాపకర్మవల్లన జనించు యీవుపదంశమున కఠినమై, మృదువై, రెండువిధములుగ వ్రణము జనించును. మొదటిదగు ముఖ్యోపదంశము సర్వ దేహమును తపింపజేయును. రెండవదైన గౌణోపదంశము లింగప్రదేశమును మాత్రమే బాధించును. ఇది ముఖ్యోపదంశమువలె చికిత్స కసాధ్యముకాక సాధ్యమైయుండును. పురుషునకు లింగముయొక్క అగ్రభాగమున, చర్మా వరణయందున స్త్రీకి భగద్వారమందున, యోనిపెదవులయందున పిడకలు జనించును. వస్తియంతటను కఠినమై విడిపోయిన రసవాహికనాడులు గట్టి వగు మూలములుకలవై మధ్యపల్లమై జ్వరము, కడుపుబ్బరము మొదలైన రోగముల జనింపజేయును. ముఖ్యోపదంశవ్యాధి శాంతినొందినను ఆవిషము దేహమందుండి వివిధవికారముల గల్గించుచుండును. చర్మమందు కాంతిభేద ము, నేత్రరోగము, కనురెప్పలయందలి వెంట్రుకలూడుట, గ్రంథిరోగము, పీనస, కుష్టము యివి జనించుట గౌణోపదంశలక్షణములు. పాపోపదంశము యొక్క విషము శ్లేష్మగ్రంథులయందు ప్రసరించి బహుదుఃఖకరమగు జ్వర ముతో కూడిన బ్రధ్నరోగమును కలుగజేయును.

## ఓ జో మే హ ని దా న మ్.

శ్లో. అభిఘాతాగ్నిమాన్ద్యామవాతాజీర్ణాదిరోగతః।
విషమజ్వరశోథాద్యైర్వ్యక్షకాసాదిభిస్తథా।
వృక్కాయో శోణితస్రోతో వికృతే రసదోషతః।

లసికాశుక్రపూయాస్రైర్యుక్తే మూత్రే తథానృణామ్।
స్త్రీణాం గర్భాగమే చైవ కటుకక్షారవర్జితైః।
మధురౌజస్కరద్రవ్యభక్షణై రతిమాత్రితః।
గురుపర్యుషితాన్నాచ్చ భోజనాదతిభోజనాత్।
నవధాన్యాదిగోధూమ హంసడిమ్బాతిసేవనాత్।
దూషితే శీతలే తోయే స్నానపానావగాహనాత్।
నిదానై రేభిరత్యైశ్చ దూషితాదోజసో భవేత్।
ఓజో మేహ స్సవిజ్ఞేయ ఆయుర్బలనికృన్తనః।
దేహాశ్రమవశాద్దేతో రథవాన్యేన హేతునా
ద్రుతం శోణితసఞ్చారాత్ ప్రకృతేశ్చ విపర్యయాత్।
ఓజో వికృతిమాపన్నం హంసాణ్డశ్వేతభాగవత్।
పిష్టతణ్డుల వద్వాథ సహమూత్రేణ సంస్రవేత్।
మేధః క్షయో భవేత్తత్ర జ్వరారోచకయోస్తథా।
శోథేఽగ్నిమాన్ద్యే సఞ్జాతే గదోఽసాధ్యోనసంశయః।
అన్యథా కృచ్ఛ్రసాధ్యోఽసౌ యత్నా జ్జీవతిమానవః॥

తా. దెబ్బతగులుట, అగ్నిమాంద్యము, ఆమవాతము, అజీర్ణము మొదలైనరోగములవలన, విషమజ్వరము, ఉబ్బు మొదలైనవానిచేతను, క్షయ, దగ్గు మొదలైనవానివలనను, మూత్రపిండములయొక్క, రక్తముయొక్క, స్రోతస్సులయొక్క, వృద్ధిక్షయములచేతను, రక్తమాలిన్యమువలనను, పురుషులకు లసిక, శుక్రము, దుర్గంధయుక్తమైన రక్తముతోగూడిన మూత్రమందును, స్త్రీలకు గర్భోత్పత్తిసమయమందు కారము, ఉప్పు లేనిపదార్థసేవనచేతను, మధురము, వీర్యవృద్ధికరమైన పదార్థసేవన, యెక్కుడుచేయుటచేతను, గురు

త్వమైనట్టియు, పాచిదైనట్టియు పదార్థసేవన, క్రొత్తధాన్యము, గోధుమలు, హంసపిల్లలు వీనియొక్క విస్తారసేవనవలన, దోషయుక్తమై చల్లనైన వుదక మందు స్నానపానావగాహనములవలనను, యిట్టి యితరకారణములచేతను ఓజస్సు దూషితమగును. ఇది ఆయుర్బలముల నసింపజేయుచు ఓజోమేహ మని చెప్పబడును. దేహము మిక్కిలి యలయుటచేగాని లేక యితర కారణ ములచేతగాని రక్తవేగమువలనగాని, తత్వముయొక్క మార్పువలనగాని, కరి గినవోజస్సువికృతినిబొంది హంసగుడ్డునందలి తెల్లచొనవలెను, బియ్యపుపిండి వలెను మూత్రముతోకూడ స్రవించును. ఈరోగమందు మేదోక్షయము, జ్వరము, అరుచి, ఉబ్బు, అన్నమాంద్యము కలిగిన నసాధ్యమగును. ఇతర లక్షణములు మాత్రమేయుండిన కష్టసాధ్యమై ప్రయత్నమువలన రోగి జీవించును.

## శు క్ర దో ష ని దా న మ్.

శ్లో. బీజం యస్మాద్వ్యవాయేషు హర్షయోని సముత్థితమ్।
శుక్రం పౌరుషమిత్యుక్తం తస్మాద్వక్ష్యామి తచ్ఛృణు।
యథా బీజమకాలామ్బుక్రిమికీటాగ్నిదూషితమ్।
నవిరోహతి సందుష్టం తథా శుక్రం శరీరిణామ్।
అతివ్యవాయాద్వ్యాయామాదసాత్మ్యానాం చ సేవనాత్।
అకాలే వాప్యయోనౌ వా మైథునం నచగచ్ఛతః।
రూక్షతిక్తకషాయాతిలవణామ్లోష్ణసేవనాత్।
నారీణామరసజ్ఞానాం స్రవణాజ్జరయా తథా।
చిన్తాశోకా దవిస్రమ్భా చ్ఛస్త్రక్షారాగ్నివిభ్రమాత్।
భయాత్ క్రోధాదతీసారాద్వ్యాధిభిః కర్షితస్యచ।

వేగాఘాతాత్క్షతాచ్చాపి ధాతూనాం సంప్రదూషణాత్।
దోషాః పృథక్ సమస్తా వా ప్రాప్య రేతోవహాః స్సిరాః
శుక్రం సన్దూషయన్త్యాశు తద్వక్ష్యామి విభాగశః।
ఫేనిలం తను రూక్షంచ వివర్ణం పూతి పిచ్ఛిలమ్।
అన్యధాతూపసంసృష్టమవసాది తథాష్టమమ్।
ఫేనిలంతత్తు రూక్షంచ కృచ్ఛ్రేణాల్పచ మారుతాత్।
భవత్యుపహతం శుక్రం నతద్గర్భాయ కల్పతే।
సనీలమథవా పీతమత్యుష్ణం పూతిగన్ధిచ।
దహల్లిఙ్గం వినిర్యాతి శుక్రంపిత్తేనదూషితమ్।
శ్లేష్మణా బద్ధమార్గంతు భవత్యత్యన్త పిచ్ఛిలమ్।
స్త్రీణామత్యర్థగమనా దభిఘాతాత్క్షతాదపి।
శుక్రంపరివర్తతే జన్తోః ప్రాయేణ రుధిరాన్వయమ్।
వేగసన్ధారణాచ్ఛుక్రం వాయునా విహతం పథి।
కృచ్ఛ్రేణ గ్రథితం గచ్ఛత్యవసాది తథాష్టమమ్।
ఇతిదోషాస్సమాఖ్యాతాః శుక్రస్యాష్టౌ సలక్షణాః॥
శుద్ధరూపమ్:—

శ్లో. స్నిగ్ధంఘనం పిచ్ఛిలం చ మధురం చావిదాహిచ॥
రేతశ్శుద్ధం విజానీయాచ్ఛ్వేతం స్ఫటిక సన్నిభమ్॥

తా. మైథునమునందు సంతోషకారణమువలన పుట్టినట్టియు, ప్రజో త్పాదకమైనట్టియు, శుక్రమును పౌరుషమని చెప్పుదురు. అకాలవర్షము, క్రి

మికీటకములు, అగ్నులు, వీనిచే దూషితమైన బీజము మొలవనిచందంబున పురుషులయొక్క శుక్రము దుష్టమయి సంతానజనకముకాదు. అతిమైథునము, అతివ్యాయామము, శరీరప్రకృతికి విరుద్ధమైన యాహారసేవన, అకాలమందు యోని భిన్నస్థానమున మైథునము, ఆరిపోయినట్టియు, చేదయినట్టియు మిక్కిలి పుల్లన, ఉష్ణనమైనట్టియు, మిక్కిలివేడియైనట్టియు పదార్థసేవన వలన, రసజ్ఞతలేని స్త్రీలతో సంభోగించుటచేతను, ముసలితనముచేతను, చింత, శోకము, విశ్వాసము లేకపోవుట వీనివలనను, శస్త్రము, క్షారము, అగ్ని, తొందర వీనివల్లను, భయమువలనను, క్రోధమువలనను, అతిసారాది వ్యాధులచేత కృశించినవానికిని, మలమూత్రాది వేగముల నిరోధించుట వలనను, నరుకువలనను, రసాదిధాతువులు దూష్యము లగుటవల్లను, వాతాదిదోషములు వేరువేరుగనైనను లేక వొక్కమారుగనైనను రేతస్సును వహించు సిరలను బొంది శుక్రమును శీఘ్రముగ దూషింపజేయును. ఆశుక్రము, నురుగు, సూక్ష్మము, యిగిరినది, కాంతిహీనము, దుర్గంధము, జిగురు గలదినై యితరధాతువులతోకలసి అష్టమధాతువని చెప్పబడువోజస్సును కృశింపజేయును. వాయువువలన నురుగై యిగిరినదై స్వల్పమైనట్టి శుక్రము గర్భోత్పత్తికి కారణము కానేరదు. నల్లనిదియు, లేక పచ్చనిదియునై, వేడియై దుర్గంధయుక్తమైయుండి లింగమును మండించుచున్నట్లు పిత్తముచే శుక్రము బయలు వెడలును. శ్లేష్మముచే నావరింపబడిన మార్గము అతిజిగురుగనుండును. స్త్రీ సాంగత్యమువలన, దెబ్బవలన, నరుకువలన, రక్తముతోకూడిన శుక్రము పురుషునకు తరుచుగ ప్రసరించును. మలమూత్రాది వేగధారణవలన వాయువుచే వ్యాప్తమైన శుక్రము, అతికష్టముమీద గ్రంధిరూపమును బొంది అష్టమధాతువును పీడించును. ఈప్రకారముగ అష్టదోషములు శుక్రమునకు చెప్పబడినవి.

జిడ్డు, చిక్కదనము, జిగురు, మధురము, అవిదాహము (శాంతి) స్ఫటికమువలె తెలుపు యీలక్షణములుగల శుక్రము శుద్ధమయినది.

## హృద్యన్త్రరోగనిదానమ్.

ఆవరణికః:—

శ్లో. ఆమవాతాద్వృక్కదోషాత్ శీతార్ద్రత్వనిషేవణాత్।
హృత్కోష్ఠావరణీ క్షిప్రం పీడ్యతే హ్యకృతాత్మనః॥
తతోదాహోష్ణతా శోథో గౌరవం మహతీ వ్యథా।
కోష్ఠసంవేపనం కాసో దౌర్బల్యం శ్వాసకృచ్ఛ్రతా।
నాసామార్గేణ రక్తస్య శ్రుతిర్వహ్నేశ్చ మన్దతా।
శోథో శాఖాసు జాయేత ధరా విషమగామినీ।
నామ్నావరణికో హ్యేష వ్యాధిర్విద్వద్భిరుచ్యతే।
జాతమాత్రశ్చికిత్స్యోఽయం నైవోపేక్ష్యః కదాచన॥

కోష్ఠికః:-

శ్లో. ఆమవాతాదభీఘాతాత్తథావరణికాద్గదాత్।
హృత్కోష్ఠే జాయతే శోథో గదఏషహి కోష్ఠికః।
జ్వరో దాహోఽరుచిః కమ్పో వైవర్ణ్యం వహ్నిసంక్షయః।
శ్వాసః కాసోఽథవా యస్మిన్ కోష్ఠే పూయస్య సఞ్చయః।
మూర్ఛాఽఽక్షేపః ప్రలాపశ్చ నాడీ విషమవాహినీ।
గదాద్ఘోరతరాదస్మాత్ భాగ్యాత్కోఽపిహి ముచ్యతే॥

పృథుకః:—

శ్లో. శోణితస్య గతౌ కోష్ఠే వ్యాహతాయామనాత్మనః।
హృత్పేశీ పృథుతాం యాతి మిథ్యాహారవిహారతః।

రుక్కమ్పా హృదయస్థల్యా ద్దౌర్బల్యం శ్వాసకృచ్ఛ్రితా।
అరతిర్భ్రిమమోహశ్చాచ చిహ్నాని పృథుకే గదే॥

ఆయామికః:—

శ్లో. హృత్కోష్ఠే పరిస్రుతిర్నామ్నా వ్యాధిరాయామికో మతః।
శ్వాసశ్శోథో భ్రిమో మూర్ఛా హృత్కమ్పో వహ్ని మన్దతా।
జలోదరమనిద్రత్వం బలమాంసపరిక్షయః।
ఏభిరన్యైశ్చవిజ్ఞేయశ్చిహ్నైరాయామికోగదః॥

పరిక్షయః:—

శ్లో. క్షయాత్సఞ్జాయతే ఘోరో వ్యాధిర్నామ్నా పరిక్షయః।
కోష్ఠపేశ్యాః క్షయః శ్వాసో దౌర్బల్యం సదనం భ్రమః।
హృద్వేపథుర్వహ్నిమాన్ద్యం క్రమాచ్ఛోథశ్చ జాయతే।
ఏతై రన్యైశ్చ విజ్ఞేయశ్చిహ్నైర్వ్యాధిః పరిక్షయః॥

మేదస్స్రుతిః:—

శ్లో. హృత్కోష్ఠే మాంససూత్రేషు మేదఃకణచయో గదః।
మేదస్స్రుతాఖ్యయా ప్రోక్తో మునిభిస్తత్త్వవేదిభిః।
మన్దంమన్దం వ్రజేన్నాడీ భవే ద్ధృదయవేపథుః।
అవసాదో భ్రమో మూర్ఛా నాడీనాం బలసంక్షయః।
హృద్వృతేవాఽపి సంభేదాన్మృత్యుశ్చ సహసా భవేత్।
జాతమాత్రశ్చికిత్స్యోఽయం వ్యాధిః పరమదారుణః॥

విక్షేపికా:—

శ్లో. హృత్కోష్ఠాక్షేపికా పీడా నామ్నా విక్షేపికా మతా।
జాతేస్మిన్ మహతి వ్యాధౌ కోష్ఠదేశేప్యురోస్త్యధః।
వామబాహౌ తదంసాస్థి గ్రీవాయాం పృష్ఠదేశతః।
వేదనా జాయతే తీవ్రా ప్రాణమర్మనిపీడని।
తోదభేదౌ సమాకర్షో దాహస్తత్ర చ జాయతే।
ముహుర్ముహుః శ్వాసరోధః శీతా త్వక్ స్వేదనిర్గమః।
ఆధ్మానానాహమోహాశ్చ వైవర్ణ్యం కృశతారుచిః।
క్రమాదిన్ద్రియవిధ్వంసో మరణం చాప్యనాత్మనః॥

తా. బుద్ధిహీనునకు ఆమవాతమువలన, మూత్రపిండ రోషమువలన, చల్లనితడిగల వస్తుసేవనవలన, హృదయకోశముయొక్క మధ్యభాగము శీఘ్రముగ పీడ గల్గును. హృత్కోశమున మంట, వేడి, శోథ, బరువు, చెప్పలేని గొప్పబాధ, హృదయకోశము వాచుకుట, దగ్గు, బలహీనము, ఆయాసము, నాసామార్గమున రక్తస్రావము, అగ్నిమాంద్యము, స్రోతస్సులయందు ఉబ్బు, నాడియొక్కగతి విషమముగనుండుట, ఇట్టిలక్షణముల గలుగు వ్యాధి విద్వాంసులచే ఆవరణికమని చెప్పబడెను. ఈరోగము పుట్టినవెంటనే చికిత్సింప దగినదేగాని ఉపేక్షించరాదు.

ఆమవాతమువలన, పడుటవలన, జనించిన ఆవరణికరోగమువలన హృత్కోష్ఠమున వాపుగలిగిన నది కౌష్ఠికమనబడును. జ్వరము, దాహము, అరుచి, కంపము, కాంతిహీనము, అగ్నిమాంద్యము, శ్వాస, కాస, క్షయ, హృత్కోశమున చీముచేరుట, మూర్ఛ, చలనము, ప్రలాపము, నాడియొక్క విషమగతి, ఇట్టిలక్షణములుగల ఘోరతరమైన కౌష్ఠికహృద్రోగమున అదృష్టవంతుడు మాత్రమే జీవించును.

రక్తము హృదయమున సంచరించుచుండ అడ్డుపెట్టబడినపుడు హృత్కోశమందుండు ఘోర విష మాహారవిహారములవలన వాచి పెద్దదగును. పోట్లు, వొణుకు, హృదయదౌర్బల్యము, శ్వాసకృచ్ఛ్రము, పనులయం దాసక్తి లేకుండుట, భ్రాంతి, మోహములనెడిచిహ్నములు వృద్ధకహృద్రోగమునఁగలుగును.

హృదయకోశమున శ్వాస, వాపులుగలుగుట, భ్రమ, మూర్ఛ, హృదయకంపము, అగ్నిమాంద్యము, జలోదరము, నిద్రాహాని, బలమాంసక్షయము యీలక్షణములు ఆయామిక హృద్రోగమున కలుగును. దీనికి ప్రసృతియని నామాంతరముగలదు. క్షయవలన హృదయకోశము క్షీణించుట, శ్వాస, దౌర్బల్యము, పేగులరచుట, భ్రమ, గుండెదడ, అగ్నిమాంద్యము, క్రమముగ శోఫ యీలక్షణములు గలది పరిక్షయ హృద్రోగమని తెలియవలయును.

హృదయకోశమందు, మాంసమాత్రములయందు, కొవ్వుయొక్క సూక్ష్మాంశవలన గల్గురోగము మేదస్సాత్రి హృద్రోగమని మునులచే వచింపబడెను. మెల్లగ నాడి సంచరించుట, హృదయము కంపించుట, వొడలునొప్పులు, భ్రమ, మూర్ఛ, నరములబలహీనత, హృదయకోశముయొక్క ప్రకృతి మార్పు యీలక్షణములుగలిగి శీఘ్రముగ మరణము సంభవించును. ఈవ్యాధి బయలుదేరినవెంటనే చికిత్సింపని యెడల పరమదారుణ మగును.

హృదయకోశము తెరువబడి బాధగలిగిన విక్షేపిక హృద్రోగ మనబడును. ఈఘోరవ్యాధియందు హృత్కోష్ఠమున, వక్షస్థలయొముకలకు క్రింది భాగమున, ఎడమచేతియందు, భుజ శిరస్సులయందు, కంఠమున, పృష్ఠభాగమున ప్రాణములను, మర్మస్థానములను వేధించు తీవ్రమైన వేదన కలుగును. పోటు, సలుపు కలిగినవెనుక మంటకలుగును మాటిమాటికి శ్వాసావరోధము, చర్మము చల్లగనుండుట, చెమటపట్టుట, ఆధ్మానము, ఆనాహము, మోహము, కాంతిహీనము, కృశత్వము, అరుచి, క్రమముగ యింద్రియములయొక్క దౌర్బల్యము కలిగి ఆత్మనిగ్రహము లేనివానికి ప్రాణాపాయము గలుగును.

## జరాయురోగనిదానమ్.

శ్లో. నైరన్తర్యేణ గర్భస్య సమ్భవాత్ స్రావతోఽస్యచ।
పాపోపదంశతః శైత్యాత్తథార్ద్రస్థానసేవనాత్।
అతివ్యవాయతః పాపమేహినా సహ సఙ్గమాత్।
జరాయురోగోజాయేత రూపాణ్యస్య నిశామయ।
జ్వరోఽగ్నిమాన్ద్యమాస్యస్య నీలత్వం త్రికతోదనమ్।
వ్యథా నిమ్నోదరే వస్తౌ వృష్ణత్వం గౌరవంతథా॥
ముహుర్ముహుర్మూత్రప్రవృత్తిశ్చ యోనితః క్లేదసంస్రుతిః।
మలస్యాతిప్రవృత్తిశ్చ తతస్తద్రోధ యేవవా
దుర్నామాని చ దౌర్బల్యం శిరోరుక్ వమథుస్తథా।
జరాయురోగే జాయేత లక్షణం చైవమాదిచ॥

తా. స్త్రీలకు ప్రతిసంవత్సరము గర్భోత్పత్తివలన, గర్భస్రావము వలన, ఉపదంశమువలన, చలి, తేమ, గలప్రదేశములయందు నివసించుట వలన, అతిమైథునమువలన, ఔపసర్గిక మేహరోగితో సంగమమువలన, జరాయురోగము సంప్రాప్తించును. జ్వరము, అజీర్ణము, ముఖమందునలుపు, పిరుదులయందుపోటు, సలుపు, పొత్తికడుపునందు వస్తియందు వేడిగను బరువుగను నుండుట, మాటిమాటికి మూత్రము వెడలుట, యోనినుండి జిడ్డుగల స్రావముగలుగుట, మలమెక్కువ యగుట, తరువాత మలబద్ధము కలుగుట, మూలవ్యాధి, దౌర్బల్యము, శిరస్సునందుపోటు, వమనము, మాసిసంబంధమగు రోగము యివికలుగుట మొదలైనలక్షణములు జరాయురోగమున కలుగును.

## అచలవాతనిదానమ్.

స్వరూపమ్:—

శ్లో. యద్యైవ సంస్థయా జన్తుర్మోహమాప్నోతి చేతతః।
పరతోఽపి తయా తిష్ఠేత్ సాపిచేత్ క్లేశకృత్ భృశమ్।
స గదోఽచలవాతాఖ్యోఽచలసంస్థానమేవచ।
తాదవస్యగదశ్చాపి తద్ధైవా పరివర్తకః॥
వాతాగతే స్వమస్థానాత్ పూర్వభావస్థితేస్తథా।
తద్ధైవాపరివృత్తేశ్చ మతం నామచతుష్టయమ్॥

హేతుః:—

శ్లో. చింతనాత్ క్షీణధాతుత్వార్భయాత్ సత్వస్య సంక్షయాత్।
బీజదోషవశాచ్చైవ జాయతే పరివర్తకః॥

తస్యలక్షణమ్:—

శ్లో. స్పర్శహానిరచేష్టత్వం పేశీనాం దృఢతాతథా।
మూర్ఛనఞ్చ వినాక్షేపం చిహ్నాన్యపరివర్తకే।
అసామాన్యం గదస్యాస్య లిఙ్గం ప్రాక్సంస్థయాస్థితిః।
కదాచిచ్ఛ్వాసభూయస్త్వం ధమన్యాః క్షుద్రతాతథా।
పూర్వరూపం వినావ్యాధి స్సహసైవ ప్రకాశతే।
గ్రీవాదార్ఢ్యం శిరఃపీడా కదాచిచ్చలచిత్తతా॥

తా. అవయవముల గదల్పక విస్తారకాలము వోకేమాదరి హూరుచుంతీన
కొలదిని బాధ అధికమగుచుండిన అచలవాతమనియు, అచలసంస్థానమనియు,

తాదవస్థ్యగదమనియు, అపరివర్తక రోగమనియు, చెప్పబడును. వాతాగతి వలన, సంస్థానము (కదలక కూర్చుండుట) వలన, పూర్వాభావస్థితి (ఎప్పుడును కూర్చుండనిపద్ధతిగ కూర్చుండుట) వలన, కదలకుండుటవలన అను నాల్గు విధములుగ యీయచలవాతము జనించును.

ఆలోచనవలన, ధాతుక్షీణమువలన, భయమువలన, బలక్షయమువలన, బీజదోషమువలన అపరివర్తకమను అచలవాతము జనించును.

స్పర్శహాని, చేష్టా, హీనము, నరములు బిగబట్టుట, కదల్పకుండిన మూర్ఛగలుగుట, అచలవాతమునకు లక్షణములు. ఈరోగముయొక్క లక్షణము అనుపమానము. పూర్వస్థితిలోనే కూర్చొనియుండిన నొకప్పుడు శ్వాసాధిక్యము, వాడులు ముడుచుకొనుట, పూర్వరూపములేకుండగనే వ్యాధిజనించుట, మెడబిగబట్టుట, శిరస్సుయొక్క పీడ, నొకప్పుడు చిత్తచాంచల్యము కలుగును.

## వం ధ్యా రో గ ని దా న మ్.

శ్లో. భేదావంధ్యా బలానాంహి నవధా పరికీర్తితాః।
తత్రాదివంధ్యా ప్రథమా పాపకర్మవినిర్మితా।
రక్తేనచ పృథగ్దోషైః సమస్తైః పంచధాభవేత్।
భూతదేవాభిచారైశ్చతిస్రో వంధ్యాః ప్రకీర్తితాః।
గర్భస్రావీమృతాపూర్వా మృతవత్సాద్వితీయకా।
తృతీయాస్త్రీప్రసూతిస్స్యాత్కాకవంధ్యా సకృత్ప్రసూః।
పుమానపి భవేద్వంధ్యోదోషైరేతైశ్చశుక్రతః॥

తా. స్త్రీలయొక్క వంధ్యారోగము 9 విధములు. ఆదివంధ్య, రక్తవంధ్య, వాతజవంధ్య, పిత్తజవంధ్య, కఫజవంధ్య, సన్నిపాతజవంధ్య, భూత

వంధ్య, దైవవంధ్య, అభిచారికవంధ్య అని 9 విధములు. కొందరు గర్భస్రావి యనియు, మృతవత్సయనియు, స్త్రీప్రసూతియనియు, కాకవంధ్యయనియు, సకృత్ప్రసువనియు అని 5 విధములైన స్త్రీవంధ్యాదోషమును చెప్పి పురుషులకుగూడ శుక్రదోషమువలన యీఅయిదు విధములయిన వంధ్యారోగము జనించునని చెప్పుదురు.

గ ద్య మ్

ఇతి శ్రీధన్వంతరి కరుణాకటాక్షలబ్ధ కవితాయుర్వేద
విద్యాధౌరేయ, శ్రీద్విభాష్యం వంశపారావార
విధు[redacted] 'వైద్యరాజ' బిరుదాంచిత
వేంకటేశ్వర గురువర ప్రసాద దోహ
దాయుర్వేదనైపుణ, శ్రీరాజ
రాజేశ్వరీ వేంకటరామపుత్ర
'రాజవైద్య' బిరుదాంకిత
వేంకటరాయాభిధేయ
ప్రణీత సాంధ్ర
తాత్పర్య
మా ధ వ ని దా న శే ష మ్

సం పూ ర్ణ మ్.